THE ANDHRA PATRIKA, MADRAS

8 పేజీలు వెల 1 అణా.

# ఆంధ్రపత్రిక

Regd. No. M. 1118 సంపుటం 40 సంచిక 270 FOUNDER DESODHARAKA K. NAGESWARA RAO గురువారము 31-12-1953

పాకిస్థాన్ - అడక్కైకుణకు భారతదేశసమాధానం: నెహ్రూకు మహమ్మదలీ లేఖ —4 వ పేజీ

యుద్ధభయంఅపరం చినప్రపంచానికినూత్నవత్సరం ఆశాజ్యోతిమూవాలి: రాధాకృష్ణన్ ఉద్బోధ —2 వ పేజీ

# రాజధానిసమస్యపైకర్యూలులో ఉన్నతస్థాయిలో సంప్రతింపులు

## దేశ ఆర్థిక పరిస్థితిలో సర్వతోముఖాభివృద్ధి

### శ్రీ చింతామణి దేశ్‌ముఖ్ సమీక్ష

### పాకిస్థాన్ ఋణంత్వరలో వసూలయ్యే అవకాశం

న్యూఢిల్లీ, డిసెంబరు 29: పాకిస్థాను భారతదేశానికి ఋణపడిన మొత్తం త్వరలో వసూలయ్యే అవకాశం వున్నదని ఆర్థికశాఖమంత్రి శ్రీ సి. డి. దేశ్‌ముఖ్ ఈవాళయిక్కడ వెల్లడించారు.

దేశ ఆర్థికపరిస్థితిలో సర్వతోముఖమైన అభివృద్ధి కనిపిస్తున్నదనీ, ధరలు కొరియా యుద్ధమునకు పూర్వముండిన ధరల స్థాయిలో స్థిరపడే ధోరణి కనిపిస్తున్నదనీ, మిగిలివున్న పంచవర్ష ప్రణాళికకాలంలో ధరలు నిలకడగా వుంటవని దేశ్‌ముఖ్ అభిప్రాయపడ్డారు.

పంచవర్ష ప్రణాళిక కాలంలో మిగిలివున్న రెండు సంవత్సరాలలో పథకాన్ని అమలు చేయడానికయ్యే ఖర్చు 100కి 60 వంతులు పెరుగుతుందని దేశ్‌ముఖ్ చెప్పుతూ, ఈ రెండు సంవత్సరాల్లో ఖర్చు చేయ నిశ్చయించిన [illegible]

[illegible] సహాయంగాక 865 కోట్లవరకు విదేశీయ సహాయం అవసరమవుతుందని అనుకొన్నాము. కాని 75 కోట్లు మాత్రమే లభ్యమయింది. ఇంకా 290 కోట్ల రూపాయలు లభ్యంకావలసి వున్నది. [illegible]

పంచవర్ష ప్రణాళిక అమలు [illegible]

(4 వ పేజీ చూడుడు)

## కృషికి పార్టీ వైఖరిపై మంత్రివర్గ సమావేశంలో చర్చ

### ముఖ్యమంత్రి తమ పూర్వ వాగ్దానాలను పునరుద్ఘాటిస్తూ మరొక ప్రకటన చేసే అవకాశం

['ఆంధ్రపత్రిక' విలేఖరి]

కర్నూలు, డిసెంబరు 30: బడ్జెట్ డిమాండ్లపై రాగల కోత తీర్మానాలను గురించి చర్చించడానికి గాను మంత్రివర్గం నిన్నరాత్రి తొమ్మిగంటలనుంచి పదకొండున్నరవరకూ సమావేశమైంది. తాత్కాలిక రాజధానిలో సెక్రటేరియట్ భవనాలూ, అసెంబ్లీ భవన నిర్మాణాలకు సంబంధించిన బడ్జెట్ డిమాండ్లమీద ముఖ్యమైన కోత తీర్మానాలు వచ్చే అవకాశం ఉన్నట్లు భావించబడింది. అయితే మంత్రివర్గంలో ఏ నిర్ణయానికి రాలేదని తెలుస్తున్నది.

శాశ్వతరాజధాని సమస్య పరిష్కారానికి ప్రత్యేకంగా వెంటనే ఆంధ్ర శాసన సభ్యుల సమావేశం జరగాలని రంగాగారు అభిప్రాయపడుతున్నట్లు తెలుస్తున్నది. అయితే రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణకు నియమించబడే విశేషాధికారాల సంఘంవారి నివేదిక గురించి భారత ప్రభుత్వ నిర్ణయం తెలుపబడేవరకూ శాశ్వత రాజధాని గురించి ఏ నిర్ణయం చేయరాదని రాష్ట్ర ప్రభుత్వం భావిస్తున్నట్లు తెలుస్తుంది.

బడ్జెట్ గురించి మంత్రివర్గం చర్చించడానికి ప్రత్యేకంగా డిసెంబరు 10 వ తేదీన ఏర్పాటు చేయబడిన సమావేశంలో భవన నిర్మాణాల ఖర్చు నిర్ణయించబడింది కనుక

(5-వ పేజీ చూడుడు)

## హైద్రాబాదులో బియ్యం రేషన్ హెచ్చింపు

### 6 ఔన్సులనుంచి 9 ఔన్సులకు

హైదరాబాదు, డిసెంబరు 29: రేపు జనవరి 1-వ తేదీనుంచి హైదరాబాదు, సికిందరాబాదు నగరాలలో బియ్యం రేషను 9 ఔన్సులకు హెచ్చింపబడుతుందని హైదరాబాదు పౌరసరఫరాల మంత్రి డాక్టరు యం. చెన్నారెడ్డిగారు ఇవాళ యిక్కడ పత్రికా విలేఖరులతో చెప్పారు. ప్రస్తుతం మనిషికి రోజుకు 6 ఔన్సులు మాత్రమే ఇస్తున్నారు.

హెచ్చించిన ఈ మూడు ఔన్సుల బియ్యం రేషను దుకాణాల ద్వారా కాక లైసెన్సు దుకాణాల ద్వారా సప్లయి కాబడుతుందని ఆయన తెలియజేశారు.

సంస్థానంలో కెల్లా ప్రస్తుతం ఈ జంట నగరాల్లో మాత్రమే రేషనింగు ఇంకా కొనసాగుతున్నది.

లండన్, డిసెంబరు 29: పాకిస్థాన్‌తో ఇరాన్ సైనికసమాధానం చేసుకోబోతున్నదనే వార్త అబద్ధం అని ఇరాన్ విదేశాంగమంత్రి పేర్కొంటూ ప్రకటన చేసారు.

## కేంద్రప్రభుత్వోద్యోగుల్లో ఏకాధిక వివాహాల నిషేధం

### సైన్యంలో అమలు జరిపినట్లే సివిల్ ఉద్యోగులపట్ల అమలు

(ఆంధ్రపత్రిక విలేఖరి)

న్యూఢిల్లీ, డిసెంబరు 30: కేంద్రప్రభుత్వం మూడు సంవత్సరాల క్రింద బహు వివాహాలను సైన్యంలో నిషేధిస్తూ జారీచేసివున్న సూత్రాన్ని ఇప్పుడు సివిల్ ఉద్యోగులపట్లగూడా అనువర్తింప చేయడానికి నిశ్చయించుకున్నది.

సైన్యాలపట్ల ప్రకటించిన ఉత్తర్వులో ఈవిధంగావుంది. సైన్యంలో ఎవరుగాని, మొదటి భార్య లేక భార్యలు వుండగా, ఆ వివాహం రద్దుకాకముందు, ఇంకో పెళ్లి చేసుకోకూడదు. అట్లా చేసుకోవాలంటే, ప్రభుత్వం అనుమతిని పొందాలి"

ఇదే ఉత్తర్వు ఇప్పుడు సివిల్ ఉద్యోగులకుగూడా పనిచేస్తుంది గాబట్టి, భార్యవుండగా ఇంకో పెళ్లి చేసుకోదలచుకున్నవారు, ఆ వివాహాన్ని రద్దు చేసుకొని చేసుకోవాలి, లేదా ప్రభుత్వం అనుమతిని పొందైనా చేసుకోవాలి అని వ్యక్తం అవుతున్నది.

కేంద్రప్రభుత్వం ఈ ఉత్తర్వును తనక్రింద పనిచేస్తున్న ఉద్యోగుల [illegible] ప్రభుత్వాలు [illegible] మాత్రం తన క్రింది ఉద్యోగుల పట్ల దీన్ని అమలుజరపడానికి నిశ్చయం చేసుకున్నది.

సైన్యంలోగనుక, ఈ మాత్రానికి విరుద్ధంగా నడిచినవారిని బర్తరఫ్ చేయడమే శిక్షగా పేర్కొనబడివుంది. అట్లాగోక పెద్దఉద్యోగిని బర్తరఫ్ గూడా చేశారు. అయితే దీన్ని యిప్పుడు సివిల్ ఉద్యోగులపట్ల అనువర్తింప చేస్తున్నారుగనుక ఇది వెనకనుంచీ అమలుజరుగుతుందా? ఇది అమలుజరిగివున్నట్లుగూడా తేలినపుడు ఉల్లంఘించినవాళ్లు ఎవరన్నావుంటే ఏమిచర్య తీసుకుంటుంది? మొదలైన అనుమానాలుకొన్ని కల్గుతున్నాయి. ఏమైనా, ఇద్దుట విజ్ఞులంతా యీ సూత్రాన్ని హర్షిస్తున్నారు.

సైన్యంపట్ల అమలు జరిపిన ఉత్తర్వు ఆఫీసర్లకు, జెసిఓలకు, వారంట్ ఆఫీసర్లకు, ఇంకా ఇతర హోదాలలోని ఉద్యోగులకు అందరికీ పడుతుంది. ఎన్‌సిఓలకుగూడా పడుతుంది.

వాతే భార్య వుండగానే ఇంకో పెళ్లి చేసుకోదలచుకున్నవారు ప్రభుత్వం అనుమతికోసం పెట్టుకొనే దరఖాస్తులో ఈక్రింది విషయాలను వివరించాలి. (1) రెండో పెళ్లి చేసుకోడానికి కారణాలు-భార్య లేచిపోయిందో, పిచ్చిదో, అంధ్యురాలో, [illegible] (2) ఇంకో పెళ్లి చేసుకుంటున్న [illegible] కలిగిన సంతానం సంఖ్య, వయస్సు.

ఈ దరఖాస్తులో ఆ వ్యక్తి పేర్కొన్న కారణాలను సబ్‌ఏరియా కమాండరుగాని, బ్రిగేడ్ కమాండరుగాని విచారణ చేయాలి. మొదటిభార్య పిచ్చిది అనే కారణం చూపిస్తే, అట్టి సర్టిఫికెట్ మెడికల్ వైద్యులవద్దనుండి చూపించాలి.



## ఆంధ్రజిల్లాల పునర్వ్యవస్థీకరణపై అసెంబ్లీలో ప్రశ్నలు

### అన్ని సమస్యలూ ప్రభుత్వాలోచనలో వున్నవని మంత్రుల సమాధానాలు

[ఆంధ్రపత్రిక విలేఖరి]

కర్నూలు, డిసెంబరు 30: "గుంతకల్లు కేంద్రంగా ఆలూరు ఆదోని రాయదుర్గం, పత్తికొండ తాలూకాలను, అనంతపురం జిల్లాలోని గుత్తి, తాడిపత్రి, కల్యాణదుర్గం తాలూకాలను చేర్చి ఒకజిల్లాగా చేయాలని కోరుతూ కొందరు శాసనసభ్యులూ, ఆప్రాంతాల వారు విజ్ఞప్తులు పంపారు. వెంటనే వాటిపై చర్య తీసుకొనే పరిస్థితిలో ప్రభుత్వం లేదు. అవసరం వచ్చినప్పుడు ఆలోచిస్తుంది." అని ఆంధ్ర ప్రభుత్వ ఉప ముఖ్యమంత్రి నీలం సంజీవరెడ్డిగారు ఇవాళ ఆంధ్ర శాసనసభ ప్రశ్నోత్తరాల వేళ సందర్భంగా నారాయణప్పగారి ప్రశ్నకు సమాధానంగా చెప్పారు:

[illegible]

శ్రీ కోటిరెడ్డి: లేను చాలా రోజులుగా ఆలోచిస్తున్నాను. అవసరమైనప్పుడు చర్య తీసుకుంటాము

శ్రీ వావిలాల: బళ్ళారి సమస్య తేలాక ఈ సంగతి ఆలోచించరాదా? బళ్ళారిని గూర్చి కేంద్రానికి వ్రాశారా?

సమాధానం లేదు.

శ్రీ ఖండవల్లి కృష్ణరావు: బళ్ళారిని గూర్చి మిశ్రా తీర్పును ఆంధ్ర ప్రభుత్వంవారు ఆమోదించారా?

శ్రీ మంత్రి సంజీవరెడ్డి: బళ్ళారి, మిగిలిన తెలుగు ప్రాంతాలు ఉన్నాయి. ఈ ప్రశ్నకు ప్రస్తుత విషయానికి సంబంధం లేదు.

[illegible]

## మాస్కోలో కేంద్రీకృతమైన మానవసామ్రాజ్యతత్వం

### ఆసియా, ఆఫ్రికాప్రజలకు డా॥ పట్టాభి హెచ్చరిక

[illegible]

(5 వ పేజీ చూడుడు)

మద్రాసు స్మాల్ కాజెస్ కోర్టు
దావా నెం. 8882/1953.
వాది జొన్నలగడ్డ రామయ్య నాయుడు.
ప్రతివాది వొద్దినేని రామయ్య నాయుడు.
వొద్దినేని రామయ్య నాయుడుకి,
పిడ్డన కాంతూరు గ్రామం,
కావలి తాలూకా, నెల్లూరు జిల్లా.

వాది పేర వ్రాసి యిచ్చి ప్రామిసరీ నోటును బాకీ రు 750/- అద్సలున్న రాబట్టుకొన వాది దాఖలు చేసిన పై దావా మద్రాసు, స్మాల్ కాజెస్ కోర్టు ఏడో జడ్జిగారియెదుట 12-1-54 ఉ|| 10-30 కి విచారణకు వాయిదా వేయబడిన దనియు, ఆ రోజు మీవు హాజరు కానంతట ఎక్సుపార్టిగా డిక్రీ యివ్వబడు ననియు, నోటీసు యివ్వడ మైనది

29-12-53. } కె. సుబ్బారావు,
మద్రాసు, } వాది అడ్వకేటు.

## చిట్ టెండరు నోటీసు

పనియొక్క పేరు:— విజయవాడ వద్ద కృష్ణా నదికి రెగ్యులేటరు కమ్. రోడ్డు బ్రిడ్జి కట్టటకుగాను, ఇబ్రహీంపట్నము క్వారీనుంచి 1½" సైజు 17 సెట్లు మెటలు రాయి సప్లై చేయుట.

శ్రీ విజయవాడ సర్కిల్ సూపరింటెండింగు ఇంజనీయరుగారు, విజయవాడ, బక్కింగ్ హామ్ పేటలో నున్న వారి ఆఫీసులో 1954 సం|| జనవరి 18-వ తేది సాయంత్రము 4 గంటల వరకు టీస్ వర్కు (K 2) కంట్రాక్టు ఫారములో పైన ఉదహరించిన పనికి సీల్డు టెండర్లు తీసుకుందురు. టెండరు వేయదలచినవారు టెండరు డాక్యుమెంట్లకుగాను దరఖాస్తులు జనవరి 11-వ తేదీ ఆఫీసు కాలములోగా సూపరింటెండింగు ఇంజనీయరు ఆఫీసుకు చేరునట్లు పంపవలెను. ఈ కాలము దాటి వచ్చిన దరఖాస్తులు పరిగణించబడవు. టెండరు డాక్యుమెంట్లు సెట్టు ఒక్కంటికి రు 5-1-8 అయిదు రూపాయల ఒక అణా మూడు పైసలు చొప్పున (సేల్సు టాక్సుతో సహా) ఆఫీసు పనిచేయు కాలములో జనవరి 11-వ తేదీ లగాయతు అమ్మబడును. ఈ డబ్బు ఏ కారణముచేత నైనను వాపసు యివ్వబడదు.)

పని పూర్తి చేయవలసిన కాలము:— రెండు నెలలు. టెండరు ధర వరుసుము:— రూ. 4,800/- (నాలుగు వేల ఎనిమిది వందల రూపాయలు.)

అదనపు హామీ రుసుము:-4,800/ (నాలుగు వేల యెనిమిది వందల రూపాయలు.)

(సం) జి. ఎ. నరసింహారావు,
సూపరింటెండింగు యింజనీయరు,
27-12-53. విజయవాడ సర్కిలు

## దక్షిణ రైల్వే గ్రెయిన్ షాపులకు సరుకులు సప్లయి చేయుటకు టెండర్లు.

పై రైల్వే గ్రెయిన్ షాపులకు దిగువ సరుకులు సప్లయి చేయుటకు ఒక్కొక్క సరుకుకు ఒక్కొక్క ఫారము విడివిడిగా టెండర్లు, సీల్డు కవర్లలో చేర్మన్, జాయింట్ పర్చేజింగ్ బోర్డు, సదరన్ గ్రూప్, C/o కంట్రోలర్ ఆఫ్ గ్రెయిన్ షాప్సు, దక్షిణ రైల్వే, మద్రాసు బీచ్ స్టేషన్ బిల్డింగ్సు, మద్రాసు-1 వారిచే 19—1—1954 తేది మధ్యాహ్నము 3-0 గంటల వరకు అంగీకరింపబడును.

2. లోడ్ I. దక్షిణ రైల్వే మద్రాసు.

కావలసిన సరుకులు:

| | |
|---|---|
| (1) కంది పప్పు | (4) మంచినూనె |
| (2) మినప పప్పు | (5) ఉప్పు |
| (3) శెనగ పప్పు | |

3. లోడ్ II. దక్షిణ రైల్వే. తిరుచినాపల్లి.

కావలసిన సరుకులు:

| | |
|---|---|
| (1) మంచినూనె | (3) ఉప్పు. |
| (2) కొబ్బరినూనె | |

4. టెండర్లు పంపదలచిన వారు, తమ టెండర్లను నిర్ణీత ఫారములో పంపవలెను. ఫారము ఖరీదు క్రింద (ఒక్కొక్క లోడుకు ఒక్కొక్క ఫారము కొరకు) రు. 1/- వంతున మద్రాసు, పార్కు టౌను, దక్షిణ రైల్వే, పే-మాస్టరు & కాషియర్ కు చెల్లించి, దిగువ సంతకము చేసిన వారి ఆఫీసునుండి షెడ్యూల్సు, స్పెసిఫికేషనులతో సహా టెండరు ఫారములు పొందవచ్చును. టెండరు ఫారము ఒకరిది మరియొకరికి మార్చుకొనరాదు. దాని ఖరీదు వాపసు చేయబడదు.

నిర్ణీతమైన ప్రామాణ్యాలలో బిడ్డింగులలో రాబడి పన్ను చెల్లుబడి సర్టిఫికేటు దాఖలు చేయుట, టెండర్లు గమనింపబడుటకు ముఖ్యావసరము. రాబడి పన్ను చెల్లుబడి సర్టిఫికేటు ప్రొఫార్మాదినుకు సంతకదారు ఆఫీసు నుంచి ఉచితంగా పొందవచ్చును.

పన్ను విధింపదగిన ఆదాయము లేక, అందువల్ల పన్ను చెల్లించిన సర్టిఫికేటు నిర్ణయించిన ప్రొఫార్మాలో పంపలేని టెండరుదారులు ఆ విధముగా ఒక ప్రమాణ పూర్వకమైన అఫిడవిటును, దాని యదార్థతను గురించి ఆయా ఇన్ కంటాక్సు ఆఫీసరుచేత గాని సంతకం చేయించి, దాఖలు చేయవలెను.

చేర్మన్,
జాయింట్ పర్చేజింగ్ బోర్డు,
(దక్షిణ & తూర్పు రైల్వేలు,)
కంట్రోలర్ ఆఫ్ గ్రెయిన్ షాప్సు ఆఫీసు, దక్షిణ రైల్వే, బీచ్ స్టేషన్ బిల్డింగ్సు, మద్రాసు-1. 29-12-1953.

## ఆంధ్ర - మద్రాసు సరిహద్దులు

### దక్షిణ సరిహద్దు సంఘ తీర్మానాలు

మదరాసు, డిశంబరు 28: ఆంధ్ర రాజ్య దక్షిణ సరిహద్దు కమిటీవారు నిన్న శ్రీ బులుసు సాంబమూర్తిగారి అధ్యక్షతను వారియింట్లో సమావేశమై యీ దిగువ తీర్మానాలను ఏకగ్రీవంగా ఆమోదించారు.

(1) భారతదేశంలో గల రాష్ట్రాల పునర్నిర్మాణము గూర్చి విచారణ చేసి సిఫార్సు చేయటానికి ఇండియా ప్రభుత్వం ఒక కమిటీని నియమించి యున్నందుకు ప్రశంసిస్తూనూ భాషా ప్రయుక్త రాష్ట్రవిభజన యేమాత్రం భారతదేశపు ఐక్యతకుగాని భద్రతకుగాని భంగం కలుగ జేయజాలదనియు. అలా భాషారాష్ట్రాలు ఏర్పడ్డం వల్ల రాష్ట్రాలలో నిజమైన ప్రజాప్రభుత్వాలు ఏర్పడి అవి దేశాభ్యుదయ పథకాలను చక్కగా నిర్వహించుటకు తగియుండగలవని అభిప్రాయాన్ని వెల్లడించారు.

(2) మదిరాసుపై ఆంధ్రులకు ఎంతవరకు న్యాయంగా హక్కు గలదన్నదే విషయముగూర్చి మదరాసు ఆంధ్ర ప్రభుత్వాలు సమగ్రముగా పరిశీలన జరిపి, ఆపైని ఉభయ ప్రభుత్వాలకు యీ విషయంలో ఏకాభిప్రాయం కుదరనిపక్షంలో, మదరాసు నగరమును కమిషనరు రాష్ట్రంగానైనా చేయాలనియూ లేదా కూమనది పరిహద్దుగా ఉంచి నగరమును విభాగించాలనియు కమిటీవారు ఉభయ ప్రభుత్వాలకు విజ్ఞప్తి చేస్తున్నారు.

(3) ఆంధ్ర దక్షిణ సరిహద్దు ప్రాంతాలందు తెలుగువారి జనాభా సంఖ్య వివరాలు అక్కడ యే ప్రాంతాలు తెలుగువారికి చెందాలనే విషయాలు మొదలైనవాటిని సేకరించి ఇండియా ప్రభుత్వం నియమించిన కమిటీ ఎదుట పెట్టటానికి ప్రజలు సిద్ధంగానుండాలని కమిటీవారు ప్రజలను కోరుచున్నారు.

(4) ఆంధ్ర సరిహద్దు తగాయిదా అంశాలు, ముఖ్యంగా చెంగల్పట్టు ఉత్తరార్కాడు సేలంజిల్లాలవద్ద సరిహద్దులందు ఆంధ్రుల న్యాయమైన హక్కులు సరిగా పరిష్కరింపబడుటకు ఆంధ్రప్రభుత్వము అధికారయుతముగా యితర ప్రభుత్వాలతో సంప్రదింపులు జరిపి కృషిచేయాలని యీ కమిటీ కోరుచున్నది.

తిరుపతిని తిరుపతి తాలూకాను తమిళులు కోరుచుండుట శుద్ధ అసహ్యకరమైన కోరికయని యీ కమిటీ అభిప్రాయ పడుచున్నది.

(5) తిరుమల తిరుపతి దేవస్థానం కమిటీని వెంటనే పునర్నిర్మాణం చేయాలని ఆంధ్రప్రభుత్వాన్ని యీ కమిటీ కోరుచున్నది.

(6) మైసూరు సంస్థానంలోని కోలారు చిత్తలదుర్గ జిల్లాలు ఆంధ్రలో చేర్చటానికి అక్కడి ప్రజలు జరుపుతున్న ప్రయత్నాన్ని యీ కమిటీ ప్రశంసిస్తున్నది.

(7) ఆంధ్ర ప్రభుత్వం మైసూరు ప్రభుత్వంతో బళ్లారి పట్నం, యితర సరిహద్దు తాలూకాల్లో మోక ఫిర్కాలపై తెలుగువారికి యుండే హక్కులను గూర్చి తిరిగి రాయబారాలు ప్రారంభించి యీ విషయమై ఏకాభిప్రాయం కుదరకపోతే ఒక సరిహద్దు సంఘమును నియమించవలసిందని ఇండియా ప్రభుత్వాన్ని కోరాలని యీ కమిటీ విన్నవిస్తున్నది.

(8) ఆంధ్రరాష్ట్ర దక్షిణ సరిహద్దు వివాదాంశాలను గూర్చి ఒక మెమోరాండము తయారుచేసి ఆంధ్రప్రభుత్వానికి సమర్పించుటకును ఆంధ్ర మంత్రులవద్దకు రాయబారం ఏర్పాటు చేయుటకును యీ క్రింది వారు గల అసెంబ్లీ సభ్యులను కలుసుకోటానికిని ఉపసంఘము నియమింపబడింది.

శ్రీయుతులు ఇ. వేణుగోపాలరెడ్డి, బి. లక్ష్మీనారాయణ (సమావేశకర్త) రంగనాథాచార్యులు, రంగాచార్యులు బి. యస్. శర్మ, సి. వి. నాయుడు, కలవల్ శాస్త్రి, జే. సుబ్రహ్మణ్యం నాయుడు, యం. మునిరెడ్డి గోవిందరెడ్డి, ఇస్నా వెంకటరామయ్య శెట్టి, కోటూరి సుబ్రహ్మణ్యం, బి. సోమసుందరరావు, యస్. సుబ్బయ్యగార్లు.

పై కమిటీవారు జనవరి 17 వ తేదీ మధ్యాహ్నం 2 గంటలకు సమావేశం అవుతారు.

## మద్రాసు కౌన్సిల్ సమావేశం

మదరాసు, డిశంబరు 29: మదరాసు కౌన్సిలు సభ యీనాడు ఛేర్మన్ డా|| పి. వి. చెరియన్ గారి అధ్యక్షతను సమావేశంకాగా ప్రశ్నోత్తరాల అనంతరం వి. యం. ఆఖాపిళ్ళెగారు (కాంగ్రెసు) డిప్యూటీ ఛేర్మన్ గా ఏకగ్రీవంగా ఎన్నుకోబడ్డారు.

తరువాత కౌన్సిలువారు మదరాసు సహకారసంఘాల (సవరణ) 1953 బిల్లును పరిశీలించి సవరించబడ్డ అసెంబ్లీలో ఆమోదింపబడిన దానిని చర్చించి ఆమోదించారు. సభ అంతటితో రేపటికి వాయిదా వేయబడింది. రేపటిరోజున బడ్జెటు జనరల్ చర్చ జరుగగలదు.

## పాటియాలాలో అరెస్టులు

పాటియాలా, డిశంబరు 29: ప్రధాని జవహర్ లాల్ నెహ్రూ ఫతేఘర్ సాహెబ్ కు వెళ్లిన సందర్భంలో జరిగిన గల్లంతును పురస్కరించుకొని ప్రభుత్వం ఇంతవరకు 8 మందిని అరెస్టుచేసింది.

## విజయవాడ పట్టణ కాంగ్రెసు

### భవన ప్రారంభోత్సవం

[స్వకీయ విలేఖరి]

విజయవాడ, డిశంబరు 25: విజయవాడ పట్టణకాంగ్రెసు కార్యాలయానికి ఈ సాయంత్రం శ్రీ కళా వెంకటరావుగారు ప్రారంభోత్సవం జరిపారు.

పట్టణకాంగ్రెస్ అధ్యక్షులు శ్రీమతి పెళ్ళచిట్టెగారు సభికులకు స్వాగతమిస్తూ పట్టణకాంగ్రెసు కార్యాలయ ఉపయోగార్థం భవనం నిర్మించి యిచ్చిన శ్రీ మండలి రామకృష్ణరావుగారికి కృతజ్ఞత తెల్పారు.

ఆంధ్రప్రదేశ కాంగ్రెసు సహాయ కార్యదర్శి శ్రీ వెండి మూర్మన్న గారు కాంగ్రెసు జండాను ఎగురవేశారు. ప్రపంచదేశాలలో మరేదేశానికి లేనటువంటి జాతీయజండా, పవిత్ర చరిత్ర కలిగిన జండా కాంగ్రెసు జండాయని చెపుతూ, ఈ దేశంలో దౌర్జన్యం, హింసలతో కూడిన జండాకు స్థానంలేకుండా చేయుటకు యువకులు విద్యార్థులు కృషిచేయాలని ఉద్బోధించారు.

శ్రీ వెంకటరావుగారు ప్రసంగిస్తూ ప్రస్తుత పరిస్థితులు నిస్పృహ చెందదగినవిగా వున్నవని, కాని ఏ కార్యక్రమాన్ని నిస్పృహతో కొనసాగించలేమని అన్నారు. ప్రస్తుత బాధ్యతలను గుర్తిస్తే కాంగ్రెసును పటిష్టంగా చేసి తమ బాధ్యతలను నిర్వహించి, స్వరాజ్యాన్ని సురాజ్యంగా చేయుటకు అందరు ఉత్సాహంతో, దీక్షతో కృషిచెయ్యాలని అన్నారు. 35 కోట్ల జనాభాగల భారతదేశాన్ని ఒకరోజులో గారడీచేసి సుభిక్షంగా చేయడంసాధ్యంగాదని చెపుతూ, ఈనాడు మనమున్న అకలితోను, కట్టుగుడ్డలేక అనేకమంది బాధపడుతున్నారని, ఈ ప్రజలకు తిండి గుడ్డ కల్పించుటకు తీవ్రకృషి జరుగుతున్నదని ఈ కృషిలో ప్రతివారు తమవంతు కృషి నిసహాయాన్ని చేయాలనివిజ్ఞప్తిచేశారు. స్వరాజ్య సంపాదనానంతరం ఇతర దేశాలవలె కాకమనదేశంలో శాంతి అంతటా కాపాడబడుతున్నదని, వారు చెప్పారు. హిందూ ముస్లిము కల్లోలాలవలన కోట్లకొలది సొమ్ము ఖర్చు పెట్టబడినదని చెప్పారు.

మన పంచవర్ష ప్రణాళిక అమలు జరిగినప్పుడు 1938 లో వుండే పరిస్థితులు కల్పించబడగలవని, కాని మన అభివృద్ధికి ఎన్ని పంచవర్ష ప్రణాళికలు అమలు పరచవలసివున్నదీ గుర్తించి ప్రజలంతా కాంగ్రెసు సంఘాలద్వారా తమకృషిని చెయ్యాలని విజ్ఞప్తిచేశారు.

ప్రజలంతా నిస్పృహను వదిలి ఉత్సాహంతో అందరు కృషిచెయ్యాలని విజ్ఞప్తిచేశారు.

మనది బీదదేశమని, మన సగటు ఆదాయం చాల తక్కువని చెపుతూ అధికోత్పత్తిని సాధించుటకు మన ఆదాయంలో కొంతభాగాన్ని మిగిల్చి దానిని పెట్టుబడిగా కృషిని సాగించాలని అన్నారు.

"అధికోత్పత్తిని సాధించుటకు వున్న మార్గాలను వివరిస్తూ రష్యాలో అవలంబించబడిన విధానాలు ప్రజలను నిర్బంధ విధానంతో, మామూలు సౌకర్యాలను గూడ లేకుండా వారు చేశారని వారు అన్నారు. మరొక విధానం ప్రజలకు నచ్చజెప్పి ఆదాయంలో మిగిల్చి దానిని అధికోత్పత్తికి పెట్టుబడిగా వినియోగించటము.

దేశాన్ని పరిపాలించగల అర్హత, దేశాన్ని అభివృద్ధిచేయాలనే సదుద్దేశాలుగల కాంగ్రెసుసంస్థ ఈ దేశానికి అభివృద్ధి సాధించగలదు"ని అన్నారు.

దేశపురోభివృద్ధికై ప్రజలంతా కాంగ్రెసులో చేరి స్వతంత్ర సముపార్జనకు ముందున్న విధంగా ఏకీకృతంగా కృషి చేయాలని విజ్ఞప్తి చేశారు.

శ్రీ కల్లూరి సుబ్బారావుగారు ప్రసంగించారు. (స్వ. వి.)

## ట్రేడ్‌మార్కుల అనుకరణకు శిక్ష

మోసగించు విధమున ట్రేడ్ మార్కులను ఉల్లంఘించినందుకు ఢిల్లీలో కర్తార్ సింగ్ అనునతను, బహదూర్ సింగ్ అనునతను శిక్షింపబడ్డారు. వీటినిగురించిన ప్రాసిక్యూషను కథనమిట్లాఉంది: 1952 అక్టోబరు 8 వ తేదీ పోలీసు వారు జరిపిన దాడుల ఫలితముగ కర్తార్ సింగ్, అతని కొడుకు ఈశ్వర్ సింగ్ ఇంట్లో ఆఫ్టర్ షేవ్, బెంగాల్ కెమికల్ వర్క్సు, స్వస్తిక ఇంకా ఇతర కంపెనీల పేర్లతో దొంగ సరుకులు పట్టుబడినవి. కర్తార్ సింగ్ 19-12-53 వ జరిగిన కోర్టు విచారణలో తన నేరము ఒప్పుకొనగా 485 ఐ. పి. సి. క్రింద రు. 800/-ల జరిమానా అది చెల్లించకపోతే 4 నెలల కఠిన శిక్ష, 487, ఐ. పి. సి. క్రింద రు. 100/-ల జరిమానా, చెల్లించక పోతే 2 నెలల కఠిన శిక్ష విధింపబడెను. కోర్టు లేచువరకును శిక్షవిధింపబడెను. జరిమానా చెల్లింపని పక్షమున రెండు శిక్షలను ఏక కాలమున అమలు జరుపబడవలెనని సెల్వబడెను.

బహదూర్ సింగ్ షాపుమీద దాడి జరుపగా ఆఫ్టర్ షేవ్ దొంగ సీసాలు, లేబిల్సు, కాపలు దొరికినవి. బహదూర్ సింగ్ కు 485 ఐ. పి. సి. క్రింద ఆరునెలల కఠినశిక్ష విధింపబడినది.

## 'భగవంతునిపై అచంచల విశ్వాసం'

### సంఘర్షణ నివారణకు సాధనమని శ్రీ రాధాకృష్ణ వుద్ఘాటన

విశాఖపట్నం, డిసెంబరు 28: "భగవంతుని వునికిని గుర్తించి, విశ్వసించిననాడు మానవకోటి నెదుర్కొంటున్న వివిధసమస్యలు పరిష్కారం కాగలవు. అపుడే సంఘర్షణ నివారించబడుతుంది. జీవితంలో వున్నతస్థానం యితరులవలెనే పొందగలగడానికి ప్రతివానికీ - పుట్టుకతో నిమిత్తం లేకుండా - హక్కున్నది.

బురదలో ఆవిర్భవించిన కమలం సుందరమైన పుష్పంగాఎంచి భగవంతుని సన్నిధిని వుంచడంలేదా?" అని శ్రీ రాధాకృష్ణ నేటి సాయంత్రం పురమందిరంలో భారత గ్రామిక ధర్మరాజ్య వైజ్ఞానిక మహాసభను ప్రారంభిస్తూ వుద్ఘాటించారు. వారు యింకా యిలా అన్నారు:

"ఒక కుటుంబంలో సభ్యులవలె ప్రపంచంలో వివిధజాతులు కలసిమెలసి వ్యవహరించాలి. ప్రజలు నేడు యీపరిస్థితిలో వున్నారంటే దానికి కారణం మతింపట వారు తిరస్కారభావం ప్రదర్శించడమే.

నేటి ప్రపంచంలో ఆధ్యాత్మిక, భౌతికశక్తులమధ్య సంఘర్షణ జరుగుతున్నది. అయితే, ఆధ్యాత్మిక, మతైకసామరస్యం సాధించగలిగితే, ప్రపంచ వినాశనానికి దారితీసే సమస్యలు పరిష్కరించబడగలవు. శాస్త్రీయంగానూ, ప్రజాస్వామ్యంగానూ లేకుండా యే మతం ప్రజలను ఆకర్షించలేదు. హిందూమతం యీ అవసరాన్ని పూర్తిగ తీరుస్తున్నది.

ప్రపంచంలో మానవకోటి నెదుర్కొంటున్న వివిధ సమస్యల పరిష్కారానికి మూలసాధనం భగవంతుని వునికిని మనం గుర్తించడమే. మానవుడు దైవత్వాన్ని పొందగలడు."

ఆహ్వానసంఘాధ్యక్షులు స్వాగతపత్రం చదివారు. మండేశ్వర శర్మగారు మహాసభ ఆశయాలు వివరించారు. వివిధప్రాంతాలనుంచి యీ మహాసభకు ప్రతినిధులు వచ్చారు.

పిదప శాంతి ఆశ్రమంలో సమావేశమైన "ఇమ్రవసం" శిష్యబృందం నుద్దేశిస్తు శ్రీ రాధాకృష్ణ ప్రేమ, ఔదార్యం గలిగివున్న హిందూమతంలో తమకు విశ్వాసం కలదన్నారు. ఆశ్రమంలో జరిగినసమావేశ సభకు శ్రీ వి. యల్. యన్. మూర్తి అధ్యక్షత వహించారు. శిష్యబృందంలో ఒకరు స్వాగతపత్రం చదివారు. శ్రీ రాధాకృష్ణ ప్రసంగిస్తూ కేవలం పైపైసుఖసంతోషాలవలన ప్రయోజనం లేదనీ, దీనివలన నాగరికత పతనం కాగలదనీ హెచ్చరించారు. మతం ఎడల విశ్వాసం హృదయంలోనుంచి పెంపొందించుకోవాలన్నారు.

### రేవు సందర్శన

సాయంత్రం శ్రీ రాధాకృష్ణ రేవు, నౌకా నిర్మాణకేంద్రం చూశారు. రేవు పరిపాలనాకర్త శ్రీ వంజాం డయ్యగారు వారికి వివిధ శాఖలు చూపించారు. శ్రీ ఆర్. యల్. గుప్త నౌకాకేంద్రం చూపించారు. (స్వ. వి.)

## రాష్ట్రాల పునర్నిర్మాణ సంఘం

### అ|| భా|| భాషారాష్ట్ర మహాసభ కార్యవర్గం విమర్శ

నాగపూర్, డిశంబరు 29: రాష్ట్రాల పునర్నిర్మాణం వ్యవహారాలను పురస్కరించుకొని ప్రభుత్వం నియమించిన కమిషన్‌లోని, సభ్యుల పట్ల అసమ్మతిని తెలియజేస్తూ అ|| భా|| భాషారాష్ట్ర మహాసభ కార్యవర్గం ఒక తీర్మానంచేసింది.

ఈ తీర్మానంలో ఈ కార్యవర్గం వారు ఈ కమిషన్ లోని ముగ్గురు సభ్యులు భాషారాష్ట్ర నిర్మాణంపట్ల విరుద్ధభావాలను తరచు ప్రకటించివున్నారని, అంతేకాక వీరికి ప్రజలతోగాని, ప్రజలఉద్యమాలతోగాని అంతగా సంబంధంలేదనిగూడా వివరించారు.

దేశంలో పరిస్థితినిబట్టి ఇప్పుడు సరిహద్దు సంస్కరణలసంఘాన్ని, లేక సరిహద్దుల నిర్ణాయకసంఘాన్ని నియమించవలసివుంది. వివిధరాష్ట్రాల సరిహద్దులను సవరించడం, బహుభాషారాష్ట్రాలను చీల్చడం, అట్టి భాగాలను తీసుకుపోయి, ఆయాభాషా ప్రాంతాలలో చేర్చడం, ఇట్టిపనులు జరగవలసివుంది, అటువంటి సందర్భంలో ఇటువంటి కమిషన్‌ను ఏర్పాటు చేయడం అర్థరహితంగా కన్పిస్తున్నది. అనిగూడా వీరు ఈ తీర్మానంలో స్పష్టంచేశారు.

ఈ తీర్మానంలో ఈ కార్యవర్గం వారు రాష్ట్రసముహాల వ్యవస్థను కొనసాగించడానికి జరుగుతున్న ప్రయత్నాలను తీవ్రంగా ఖండించారు. ఖండించిని, ఈ కమిషన్ వారి కార్యకలాపంలో ఈ పదవులను రద్దు చేయడంఒకభాగంకాదని తెలుసుకొచ్చిరంగా అనిపిస్తున్నదని అన్నారు.

ఈ కార్యవర్గం సమావేశం డా|| లంకసుందరం అధ్యక్షతను జరిగింది. డా|| ఎన్. బి. ఖరే, శ్రీ ఎస్. మహంతి, శ్రీ శీరమూర్తిస్వామి, శ్రీ కె. జి. జోడే, శ్రీ హాట్లాల్ కరి ప్రభృతులు దీనికి హాజరైనారు.

# యుద్ధభయం ఆవరించిన ప్రపంచానికి నూతనసంవత్సరం ఆశాజ్యోతిప్రసాదించాలి

## ఉపాధ్యక్షుడు శ్రీరాధాకృష్ణ ఉద్బోధ

### విశాఖపట్నంలో భారతీయ ఇతిహాస కాంగ్రెసు మహాసభ సమావేశం

వాల్తేరు, డిసెంబరు 29: "యుద్ధభీతితో కృంగిపోయివున్న లక్షలాది ప్రజలకు నూతన సంవత్సరం ఆశాజ్యోతిని ప్రసాదించాలి అది ఒక సవాలువంటిది కూడా కావాలి" ప్రపంచ శాంతిస్థాపనకు మరింత కృషిచేయుటకు ముందుకు రావలసినదిగ మనలను ఆహ్వానించడానికిగాను మనం మరింత గాఢంగా శాంతిని వాంఛించాలి.

ఎన్నో వుత్తమోత్తమమైన పథకాలు, దురాశ, విద్వేషం, ప్రబలిన కారణంగా నాశనం కావింపబడ్డాయి. ఈవుద్రేకాలనుంచి వివవిడి ప్రపంచాన్ని అధికారం, డాంబికంతో కాకుండా ప్రేమ, శాంతి, సాధనాలతో వశం చేసుకోగల మన్న విషయాన్ని గుర్తించుదాం" అని భారతీయ ఇతిహాస కాంగ్రెసు సమావేశాన్ని ప్రారంభిస్తూ ఉపాధ్యక్షుడు శ్రీ రాధాకృష్ణ ఉద్ఘాటించారు.

మన చరిత్రను ఒక నిర్ణీత పద్ధతిప్రకారం, ఎట్టిపాక్షిక దృష్టి లేకుండ తయారు చేయాలని వుద్బోధించారు. వారింకా యిలా అన్నారు.

"వేలకొద్దీ సంవత్సరాలు గడచినా, మన మామూలు స్వభావంలో చెప్పుకోదగ్గ మార్పేమీ కనుపించడం లేదు ప్రపంచంతో పాటు మనం కూడ మనకు వ్యతిరేకంగా ఎంత చెయ్యగలమో అంతా చేసినప్పటికీ మనం తట్టుకుని నిలబడ గలిగాము. మనలో మనం యింకా పోట్లాడుకుంటున్నా, శతాబ్దాల తరబడి విదేశ పరిపాలన, అంతులేని దోపిడీ జరిగినప్పటికీ ప్రపంచరంగంలో మనం యింకా ఒక ప్రముఖ స్థానం ఆక్రమించే వున్నాం.

మన పాఠశాలల్లోను, కళాశాలల్లోనూ చదివే బాలబాలికలకు గత చరిత్ర దాని ఫలితాలు గురించి బోధించాలి. ఏ విధమైన రాగద్వేషాలు లేకుండా, నిష్కర్షగా, ఎలా మన దేశంలో ప్రభుత్వాలు పడిపోయినదీ వివరించాలి. గత చరిత్రను, ప్రస్తుత స్థితిని సరియైన దృక్పథంతో పరిశీలించాల్సిన ఆగత్యం యిప్పుడు కలిగినంతగా యిదివరలో కలగలేదు. ఒక వ్యక్తిని గుర్తుపట్టడానికి జ్ఞాపకశక్తి ఎలా అవసరమో అలాగే జాతికి స్మృతి చిహ్నం చరిత్ర. భూత, వర్తమాన, భవిష్యత్ కాలాలను కలుపుతూ వుండేది చరిత్ర, ప్రఖ్యాత వ్యాఖ్యానకర్త మల్లినాథుడు చెప్పిన సంగతి చరిత్రను రచించేవారు గుర్తుంచుకోవాలి. "ఆధారం లేకుండ యీ ప్రపంచంలో యేదీ వ్రాయబడదు, సంబంధంలేని యే విషయం గురించి మాట్లాడం" అన్నమల్లినాథుని వుపాదిని గుర్తించుకోవాలి. ప్రజలను ఆకర్షింపజూసే చరిత్రకారులు కొందరున్నారు, దీనికోసంవారు యథార్థాన్ని మరుగుపరుస్తారు. లేకపోతే పిట్టకథలు అల్లుతారు. మరికొందరు సరియైన పద్ధతి ననుసరించే వారున్నారు. ఈ రెండింటిలో యేది కావాలన్నా ఎంతో తెలివితేటలు, వుహాశక్తి, విజ్ఞానం అవసరం. కే. శే. బాల్ఫర్ ప్రభువు విన్‌స్టన్ చర్చిల్ రచించిన "ప్రపంచ కల్లోలం"ను ప్రపంచ చరిత్ర ముసుగుక్రింద రచింపబడిన "చర్చిల్ యొక్క గొప్ప ఆత్మకథ"గా వర్ణించారు.

"చరిత్రనుంచి మనం నేర్చుకోవలసినది యేమీ లేదు" అనేది ఒక చేదు నిజమైనభావం ప్రబలమయినది. ఇది ఒక హెచ్చరిక చరిత్రను సక్రమంగా అర్థం చేసుకుంటే మనం బోలెడు నేర్చుకోగలం. నాగరకతను పెంపొందించుటకైతేనేమి, దాన్ని నిరోధించడానికైతేనేమి, యే శక్తులు పనిచేస్తున్నాయో గ్రహించాలి. శతాబ్దాల తరబడి విదేశ పరిపాలన, అంతులేని పీడన ప్రపంచ రంగంలో మనల్ని ఒక ప్రముఖస్థానం ఆక్రమించుకునేట్టు చేశాయి. మన దేశంలో ప్రభుత్వాలు ఎలాపడిపోయినవో యేవిధమైన రాగద్వేషాలు లేకుండా సరియైన దృక్పథంతో విచారించాలి.

మన ఎడల "విభజించి పరిపాలించు" అన్న సూత్రం అమలు పరచారని బ్రిటిషు ప్రభుత్వంపై కత్తువహించాం. కాని మన యీ విభేదాలు అంతరింప జేసుకోవడానికి మనం యేమి చేస్తున్నాము?

గత చారిత్రక సంఘటనలే సంఘం రూపురేఖలను దిద్దుతాయనీ, పరిస్థితులను మనుష్యులు అదుపులో పెట్టలేరనీ మనుష్యులను పరిస్థితులు అదుపులో పెట్టలేవనీ, చరిత్రను పరిస్థితులే రూపొందిస్తున్నాయనీ, అనుకుంటూ సంఘంలో ఏర్పడే కల్మషాన్ని అంగీకరించి ప్రయోజనం లేదు. జర్మనీ నాజీజం అవలంబించినప్పుడు "నేనేం చెయ్యగలను?" అని ప్రతి జర్మను తమాషాగ చెప్పుకున్నాడు. బాధ్యతలను వదిలివేయడం అంటే యిదే!

మనిషికి ఆచరణలో స్వాతంత్ర్యం పరిమితమై వున్నదన్న దంలో సందేహంలేదు. చారిత్రక శక్తులు తమప్రభావాన్ని వ్యక్తిపై చూపిస్తాయి. అయితే వాటిని ఎలా ఎదుర్కోవాలి, అన్న విషయంలో సక్రమంగా వ్యవహరించగల శక్తి మనిషి కున్నది.

"ఫలానా పరిస్థితుల్లో చరిత్రగతి యిలా వుంటుంది, యీ పరిణామాలు కలుగుతాయి" అని వాదించే చరిత్రకారులు కొందరున్నారు. కాని కే. శే. హెచ్. ఎ. యల్. ఫిషర్ మాత్రం యీ దృక్పథంతో ఏకీభవించలేదు. "ఐరోపాచరిత్ర" అనే ఆయన గ్రంథానికి వుపోద్ఘాతం వ్రాస్తూ, చరిత్రలో కూడ, అనుకోకుండా విచిత్ర పరిణామాలు, ఒకదానివెంట ఒకటి పరంపరగా వస్తాయని అన్నారు. ఒక్క విషయాన్ని ఆధారంగా చేసుకుని సర్వసామాన్యంగా యిలాగే జరుగుతాయని సిద్ధాంతీకరించడానికి వీల్లేదు. అనుకోకుండా కూడా విచిత్ర పరిణామాలు కలుగుతాయని, మానవకోటి చరిత్రలో వీటికి స్థానం వున్నదనీ చరిత్రకారులు గుర్తించాలి.

ఫిషర్ చెప్పినవిషయాన్ని సమర్థించడానికి కొన్ని చారిత్రక పరిణామాలు ఆధారమై వున్నాయి. గత యుద్ధకాలంలో రష్యాతో చిరకాల మైత్రి పెంపొందించుకుంటామని మిత్రరాజ్యాలు ప్రమాణం చేశాయి. జర్మనీ శత్రువనికూడ ప్రకటించాయి. నేడు యిరువురూ రెండుకూటాలుగా విడిపోయారు. జర్మనీ మిత్రరాజ్యాల అభిమాని అయినది. చరిత్ర త్రొక్కుతున్న గతులనుచూస్తే ఎవనికైనా భయం యేర్పడగలదేమో నన్నభావం కలుగుచున్నది. మనిషి తన యిష్టం వచ్చినట్లు ప్రవర్తించిన దాని ఫలితమే యిది.

మనం ప్రస్తుతం వున్నది ప్రపంచ వినాశనాన్ని తెచ్చిపెట్టగల యుగంలో. అయితే అనుకోకుండా అది ఆశాజ్యోతిని వాగ్దానాన్ని కూడా యిస్తున్నది. మనిషి ఏమి చేయలేని నిస్సహాయుడుగా, కీలుబొమ్మగా, వుండటానికి యిక వీల్లేదు. తన బాధ్యతలు గుర్తెరగాలి. పరిస్థితులు గ్రహించాలి. స్వాతంత్ర్యం లేనిచోట చరిత్ర విధిబలానికి లొంగకతప్పదు. మానవునిహోదాను గుర్తించిన మనం ప్రపంచశాంతికై వివిధజాతులను శాంతిపథాన నడిపించుటకు కృషి చేయాలి.

మనం "యేమీ చేయలేము" అనే నిరాశాజనకమైన వైఖరి నవలంబిస్తే సర్వనాశనానికి దారితీస్తుంది. అది చాలా తేలిక. కాని నాగరికత పూర్తిగా నామరూపాలు లేకుండా తుడిచిపెట్టుకుపోతుంది. యుద్ధంవలన కలిగే భయంకరఫలితాలు తెలియచెయ్యడమే గాదు, వానికి వ్యతిరేకంగా బలీయమైనశక్తిని కేంద్రీకరించాలి. యుద్ధంవలన కలిగే దుష్ఫలితాలపజడినీ మనం శాంతికై కృషిచేయడం కాదు, అసలు యుద్ధము నేడ న్యాయానికీ, మానవత్వానికీ విరుద్ధమని గుర్తించి శాంతిస్థాపనకు కృషి చేయాలి.

అంతర్జాతీయ సహకారానికి చరిత్ర ఒక బలీయమైనశక్తి. విశ్వమానవ సౌభ్రాతృత్వాన్ని, దాని యొక్క ఔన్నత్యాన్ని గుర్తించిన గొప్ప వీరుల గురించి చరిత్ర తెలియజేయాలి. న్యాయంకోసం, శాంతిభద్రతలకోసం మానవుడు సాగించిన పోరాటాన్ని సంగ్రహంగా తెలియజేసేది చరిత్ర. కేవలం పూర్వపు సంఘర్షణల గురించి వివరించేది మాత్రమేకాదు. ప్రపంచంలో యుద్ధాలభీభత్సాన్నిమాత్రమే కాక శాంతిప్రపంచంలో సాధించిన మహావిజయాలను గూడా చరిత్రలో వర్ణించాలి. ప్రపంచంలో వివిధజాతుల సంస్కృతులను పరస్పరం అర్థంచేసుకోవడానికి చరిత్ర వుపయోగపడాలి."

### డాక్టర్ కృష్ణాగారి స్వాగతోపన్యాసం

ఆహ్వాన సంఘాధ్యక్షులు శ్రీ వి. యస్. కృష్ణ ప్రతినిధులకు స్వాగతమిస్తూ వాల్తేరులో యీ మహాసభ జరగడం సంతోషకరమని అన్నారు. వారింకా యిలా అన్నారు:

"19 వ శతాబ్దంలో జర్మన్ చరిత్రకారులు సూచించిన రీతినే చారిత్రక పఠనం జరుగుచున్నది. పురాతన వస్తుసామగ్రి, శిలాశాసనాలు, చిత్రములు, మున్నగునవి ఆధారంగా చరిత్రను రచిస్తున్నాము. జర్మనీతో పోల్చిచూస్తే మనదేశంలో జరుగుచున్న చారిత్రక విచారణలో రెండు భేదాలు గోచరిస్తాయి. జర్మన్ చరిత్రకారులు భాషా సంబంధ విచారణలో తమ చారిత్రక పరిశోధనలు జోడించారు. గ్రీకు చరిత్రకారులు కళాభివృద్ధి తెలుసుకోనడం యిందుకు చాల అవసరమని అభిప్రాయ పడినారు. ఇరువురికీ భాషాశాస్త్రం ప్రాతిపదికగా వుంది. కనుక యీ రెండింటినీ అనగా భాషాశాస్త్రం, చారిత్రక పరిశోధన వీటిని సమన్వయపరచ వలసి వుంటుంది. జర్మనీలో చారిత్రక విచారణ కేవలం విశ్వవిద్యాలయాల ఆధ్వర్యాన జరిగేది. పరిశోధనా కేంద్రాలు కూడ వాటిల్లో అంతర్భాగాలుగా వుండేవి. కాని మన విధానం వేరు. విశ్వవిద్యాలయాలకు ముందే సివిల్ సర్వీసు సభ్యులు చారిత్రక పరిశోధన సాగించారు. మన 19 వ శతాబ్దపు చరిత్రకారులు తూసిడైడ్స్, మాకియవెల్లి, హెబర్ మెకాలే గార్ల సాంప్రదాయాలు అవలంబించారు. విశ్వవిద్యాలయాలు పైకి వచ్చినపిదప కూడ చారిత్రక ఆధారాల సేకరణ, భద్రపరచడం, మున్నగు కార్యకలాపాలన్నీ ప్రభుత్వం చేతుల్లోనే వుండిపోయింది. ఇదిగాక విడిగా వ్యక్తులు, సంస్థలు కూడ ప్రముఖ పాత్ర వహించాయి. ఈ సందర్భంలో వాటికన్నీ వివిధ సంస్థల కృషి పరస్పర సహకారంతో సాగించి సమన్వయ పరిస్తే బాగుంటుంది. గత అనుభవంలో యే విషయానికి చిరకాలం ప్రాముఖ్యత వుండ గలదు, దేనికి ప్రత్యేక పరిస్థితుల్లో విలువ వుండగలదు. అను విషయాన్ని గురించి చరిత్రకారులు ఆలోచించాలి. కొందరు చరిత్రకారులు గతంలో కొన్ని ప్రత్యేకపరిస్థితుల్లో కొన్ని పరిణామాలు కలిగాయి. కాబట్టి అవి ఎప్పుడూ కూడ అలాగే అటువంటి పరిస్థితుల్లో కలుగుతాయని అంటారు. మరి కొందరు ఆపరిస్థితులలోనే ఆఫలితాలు ఆకాలంలోనే సంభవమనీ, అవి యీ కాలంలో కూడ సర్వసామాన్యంగా జరుగుతాయనీ సిద్ధాంతీకరించడానికి వీలేదని వాదిస్తారు. సూక్ష్మదృష్టి, పరస్పర సంబంధం, వీటిప్రాముఖ్యత గురించి శ్రీ రాధాకృష్ణ ఇటీవల కామన్ వెల్తు విశ్వవిద్యాలయాల సమావేశంలో వివరించినసంగతి నాకు బాగా గుర్తున్నది. ఈరెండు ప్రతిగొప్పఆలోచనాపరునికి అవసరం. చరిత్రకారులు వీటిని శ్రద్ధగా గమనించాలి. అయితే మనం సేకరిస్తున్న చారిత్రక ఆధారాలు వాటిని భద్రపరచడంకోసం మనం చేస్తున్న కృషి జయప్రదమవుతున్నందున నే పైనివరించిన రెండు మనదేశంలోని పరిశోధకులకు అవసరం లేకపోయింది. గతయుద్ధంలో చారిత్రక ఆధారాలు చాలాభాగం విధ్వంసించబడినందున చారిత్రక దృక్పథం పెంపొందుటకు మరింత అవకాశం కలిగినదేమో ననితోస్తున్నది.

చరిత్రకారులకు శిక్షణయివ్వడం విశ్వవిద్యాలయాల బాధ్యతయై యున్నది. ముందు పరిశోధన సాగించుటకు ఆసక్తిగల అనేకమందికి శిక్షణయివ్వాలి. తరువాత న్యాయవాదవృత్తి యితర వుద్యోగాలలో చేరేవారికిగాను చరిత్రగురించి చక్కగా బోధించాలి చూడవలది, ప్రజలు చారిత్రక చైతన్యం పెంపొందించాలి. ఈ మూడు బాధ్యతలు విశ్వవిద్యాలయాలు వహించాలి సమావేశాల్లో పాల్గొంటున్న మహామహోపాధ్యాయ డాక్టరు. కానే అధ్వర్యాన చరిత్రకు సంబంధించిన అనేక క్రొత్తవిషయాలు మనం వినగలమని ఆశిస్తున్నాను. సమావేశాలను విశ్వవిఖ్యాతి తత్వవేత్త శ్రీ రాధాకృష్ణ ప్రారంభించడం సంతోషదాయకం.

### అధ్యక్షోపన్యాసం

సమావేశానికి అధ్యక్షత వహించిన శ్రీ కానే తమను అధ్యక్షులుగా నిర్ణయించినందుకు తమ కృతజ్ఞత తెలియజేస్తూ యిలా అన్నారు.

"చరిత్రను నేర్చుకునే విధానం గురించి కష్టంగా ప్రసంగిస్తాను. అసలు యీ 'యితిహాస' పురాణ అనే రెండుపదాలు అథర్వవేదంలో మనకు కనుపిస్తాయి. కౌటిల్యుడు తన అర్థశాస్త్రంలో దేశాధిపతి ప్రతిరోజు కొంతసేపు యితిహాసంగురించి వినాలని సూచించారు. ఇతిహాసంలో పురాణం, యితివృత్తం, అఖ్యాయిక (చారిత్రక కథలు) ఉదాహరణ, ధర్మశాస్త్రం, అర్థశాస్త్రం, యివిడి వుంటాయనీ పేర్కొన్నాడు.

చరిత్రనుగురించి పాశ్చాత్య రచయితలు యేమి నిర్వచించారో చూస్తే దేశ కాలానుగుణ్యంగా, వివిధ రచయితలు తలోవిధంగా అభిప్రాయులు వెలిబుచ్చినట్లుగా తెలుస్తుంది.

వివిధ సాక్ష్యాధారాలు సేకరించడం వాటిని పరీక్షించడం చూస్తే చరిత్ర కూడా ఒక శాస్త్రమే కావచ్చు కాని భౌతిక శాస్త్రాలకూ దానికీ చాలా భేద మున్నది. భౌతిక శాస్త్రాలు నిరూపించే విధంగా చరిత్ర స్థిరమైన ఫలితాలు సూచించదు. పైగా చరిత్ర తనంతట తాన్ని చర్విత చర్వణం కాదన్న సామెతకూడా మనం పరిశీలించాలి. చరిత్ర అంటే కేవలం యుద్ధాలు, వంశాలు, మతాలు, వీటి సంగతే కాదనీ, మనిషియొక్క వివిధ కార్యకలాపాలు, గురించి అది వివరిస్తుందనీ, చరిత్ర యొక్క ముఖ్యమైన ప్రయోజనం విద్యావిషయిక మైనదనీ యిప్పుడు సర్వసామాన్యంగా అంగీకరించబడుతున్నది. అందుచేత ప్రజలకు మనం బోధించే చరిత్రపూర్తిగా నిష్పాక్షికంగాను, నిష్కర్షగాను వుండాలి. కాని గతంలో చరిత్రకారులు యీ సూత్రాన్ని చాలా అలక్ష్యంచేశారు. యూరపియన్ చరిత్రకారులు భారతీయ చరిత్ర గురించి చాలా తిరస్కార భావంతోనూ, హాస్యభావంతోనూ, రచించారు. ఇలాగే మన పురాణాలనుగురించీ, బ్రహ్మలిపి గురించి, రకరకాలుగా అవహేళన చేశారు. మనదంతా "అనుసరించే విధానముని" ప్రచారం చేశారు.

భారతీయపండితులు తమదేశచరిత్ర తామే రచించుకోవాలని, అది విదేశీయుల పనికాదని క్రమేపీ గుర్తించారు. భావన పత్రికలో బాధ్యం చింది. భారతదేశచరిత్ర రచనకు భారతీయ యితిహాస కాంగ్రెసు పూనుకున్నది. ఇంకా చాలామందికూడా రచించారు. శ్రీ మున్షీ, మజుందార్, నీలకంఠశాస్త్రిగార్లు కూడా వివిధ చారిత్రక విషయాలపై ప్రత్యేక రచనలు సాగించారు. భారతీయ యితిహాస పరిషత్తువారు రెండుసంపుటాలు ప్రచురించారు. ఇక ఆ పిదప 1948లో భారతీయ యితిహాస కాంగ్రెసుతో అవిమిళితమైపోయింది. భారతీయ చరిత్ర రచనకు వివిధపథకాలు సమన్వయపరచాలని సూచిస్తున్నాను.

ప్రభుత్వం, రాజకీయపార్టీలకూడ యథార్థచరిత్రకు హానికలిగించే ప్రమాదం లేకపోలేదు. రాజకీయ ప్రచారానికి చరిత్ర ఒక సాధనంగా తరచు వుపయోగించబడింది. రాజకీయనేతల చేతుల్లో చరిత్రకారులు కీలుబొమ్మలై యథార్థాన్ని తెలియజేయడానికి పనికొవడలేదు. ఇటీవల లేసిన్ విద్యావిధానంగురించి డా|| జకీర్ హుస్సేన్ నివేదిక చదివాను. అది చదివినతరువాత ముఖ్యంగా 1200-1920 సం|| లమధ్య చరిత్ర రచించడం అసాధ్యమేమోనని తోచింది. ఆ నివేదికప్రకారం రచించే పాఠ్యగ్రంథం, యథార్థాన్ని త్రొక్కిపట్టేదిగాను, అబద్ధాన్ని సూచించేదిగాను వుండవచ్చునని నాకు ఆందోళనకలుగుతున్నది.

ఈరోజుల్లో ఎక్కువమంది సాంకేతిక, వ్యాపార, శాస్త్రములను అభ్యసిస్తున్నారు. చరిత్రను అభ్యసించే వారిసంఖ్య రానురాను తగ్గిపోతున్నది. చారిత్రక పరిశోధకులు మనకు అసంఖ్యాకంగా కావాలి. క్రమేపీ గత చరిత్రయొక్క ప్రాధాన్యతగురించి యువసంతతి తెలుసుకోగలదని ఆశించవచ్చు.

అఖిలభారత ఓరియంటల్ మహాసభ వారితో ఒక అంగీకారానికివచ్చి మన సమావేశాలు జరుపుకోవడం, వారిసహకారంతో గాని విడివిడిగా గాని ప్రాచ్యవిద్యల్లో జరిగిన పరిశోధన గురించి ఏటా పదముల సంపుటి ప్రచురించాలని సూచిస్తున్నాను. ప్రాచీన భారతదేశ చరిత్ర, సంస్కృతి పురావస్తు శాఖలు కలకత్తా, కాశీ, మద్రాసు, మైసూరు విశ్వవిద్యాలయాల్లో మాత్రమే వున్నాయని విచారించవలసి తెలుస్తున్నది. కొన్నిచోట్ల చరిత్రకు తగిన ప్రాధాన్యత ఇవ్వడంలేదు. విదేశాల్లో మన రాయబారులున్నారు. వారంతా రాజకీయాలలోను ఇతర వ్యవహారాలలోను అతిఘటికులు కావచ్చు. కాని వారిలో ఒకరికైనా మన దేశం గురించి యేమీ తెలియదని చెపుతున్నాను. అందుచేత ప్రతిరాయబార కార్యాలయానికీ ఒక ఇండ్ లజిస్టును పంపి ఏర్పాటుచేయాలి. శాసనాలు కొన్ని ప్రచురించబడినవి. అయినా ఇంకా చాలా ప్రచురణకు సిద్ధంగా వున్నవి. మధ్యప్రాచ్య దేశాలకుకూడా కొద్దిమంది పండితులను పంపి అనేక విషయాలు గ్రహించాలి. భారతీయ సంస్కృతికి ఒక కేంద్ర పరిషత్తు స్థాపించాలి.

ఆంధ్రుల గతచరిత్ర మహోజ్వలమైనది. భారతీయ సంస్కృతికి వారు గావించిన మహోన్నత సేవను గురించి డాక్టరు గోపాలాచారి ప్రభృతులు చక్కగా వివరించారు. భవిష్యత్తులో ఎటువంటి ఘనకార్యాలు సాధించనున్నారోనని యెంతో ఆతురతతో యావద్భారతం యెదురుచూస్తున్నది. కేవలం భాషాప్రాతిపదికపై ప్రత్యేకరాష్ట్రం యేర్పడినది మొట్టమొదటిసారిగా ఆంధ్రరాష్ట్రమే. దేశభక్తిలోను, సహకారంలోను, కష్టించి పనిచేయడంలోను ఆంధ్రులు యితర రాష్ట్రాల ప్రజలకు ఆదర్శప్రాయులుగా వుంటూ తమ పూర్వవైభవాన్ని పునరుద్ధరించుకుని స్వీయ రాష్ట్రాభివృద్ధికి, దేశాభివృద్ధికి పాటుపడగలరని మేమంతా ఆశిస్తున్నాము.

## వి. కే. కృష్ణమీనన్

మదరాసు, డిశంబరు 29: శ్రీ వి. కే. కృష్ణమీనన్ గారు న్యూఢిల్లీ నుండి డిశంబరు 31 వ తేదీన మదరాసుకు రానున్నారు. వారు నగరంలో మూడు రోజులు ఉండి జనవరి 2 వ తేదీని తిరువాంకూరు కొచ్చిన్ వెళ్ళి అక్కడ 6 వ తేదీదాకా యుండి జనవరి 7 వ తేదీని తిరిగి ఢిల్లీ చేర్తారు.

## నోటీసు

రంగూన్ సిటీసివిల్ కోర్టులో

కారణము తెలుపుటకు

1952సం. సివిల్ మిసలేనియస్ నెం. 1, 1950సం. సివిల్ రెగ్యులర్ వ్యాజ్యము నెం. 25 నుండి ఉద్భవించినది.

వాది:- త్యాగల వీరన్న

1. పెదిరెడ్ల సన్యాసమ్మ, కీ॥ శేషులైన పెదిరెడ్ల సన్యాసి పాత్రుడుగారి భార్య, నర్సీపట్నం గ్రామ కాపురస్థులు, యెలమంచిలి తాలూకా, విశాఖపట్టణం జిల్లా, మదరాస్ స్టేటు.
2. అదినారాయణ, 1 నెం. ప్రతివాది యొక్క మైనరు కుమారుడు, ప్రస్తుతము ఆమెతో నివసిస్తున్నవాడు, వ్యాజ్యవిషయమై గార్డియనుగా నియమింపబడిన 1 నెం. ప్రతివాది ద్వారా.
3. వెంకటరామణ, 1 నెం. ప్రతివాది యొక్క మైనరు కుమారుడు, ప్రస్తుతము ఆమెతో నివసిస్తున్నవాడు, వ్యాజ్యవిషయమై గార్డియనుగా నియమింపబడిన 1 నెం. ప్రతివాది ద్వారా
4. కృష్ణ, 1 నెం. ప్రతివాది యొక్క మైనరు కుమారుడు, ప్రస్తుతము ఆమెతో నివసిస్తున్నవాడు, వ్యాజ్య విషయమై గార్డియనుగా నియమింపబడిన 1 నెం. ప్రతివాది ద్వారా
5. పెదిరెడ్ల చిన్న సన్యాసి పాత్రుడు, నర్సీపట్నం కాపురస్థుడు, యెలమంచిలి తాలూకా, విశాఖపట్నం జిల్లా, మదరాస్ స్టేటు.
6. అప్పారావు, 7. రాములు, వీరిద్దరు 5 నెం. ప్రతివాది యొక్క మైనరు కుమార్లు, ప్రస్తుతము అయనతో పై నుదహరింపబడిన చిరునామా వద్ద నివసిస్తున్నవారు, వ్యాజ్యవిషయమై గార్డియనుగా నియమింపబడిన 5 నెం. ప్రతివాది ద్వారా - ప్రతివాదులు.

ప్రతివాదులకు -1 నెం. ప్రతివాదిని 2, 3, 4 నెం. ప్రతివాదులకు గార్డియనుగాను, 5 నెం. ప్రతివాదిని 6, 7 నెం. ప్రతివాదులకు గార్డియనుగా కోర్టు నియమించుటకు వాది ఈ కోర్టులో దరఖాస్తు ఒకటి దాఖలు చేసినందున మీకు చేయబడే హెచ్చరిక యేమనగా:-

1954 సం. ఫిబ్రవరి నెల బుధవారము 10-వ తేదీ ఉదయము 11 గంటలకు మీరు స్వయముగా గాని లేక విషయములన్నియు సవిస్తరముగా తెలియచేయబడిన ప్లీడరు ద్వారా గాని ఈ కోర్టులో హాజరై, పై నుదహరింపబడిన దరఖాస్తునకు విరుద్ధముగా కారణము జూపవలెననియు అట్లు చేయుటకు తప్పిన యెడల సదరు దరఖాస్తు మీ పరోక్షమున విచారింపబడి తీర్మానింపబడుననియు తెలియ చేయబడుచున్నది.

నా స్వహస్తముతోను ఈ కోర్టు ముద్రతోను 1953 సం. జూలై నెల 15 తేదీని ఇవ్వబడినది

ఉత్తరవు ప్రకారము.
బాన్యన్,
చీఫ్ క్లార్కు.

---

వ్యాజ్యమందు నిర్ణయింపబడవలసిన విషయములను స్థిరపరచుటకు ఇవ్వబడిన సమ్మను.

సివిల్ ప్రొసీజరుకోడు ఆర్డరు 5, రూల్సు 1 మరియు 5

రంగూన్ సిటీసివిల్ కోర్టులో

1950 సం.పు సివిల్ రెగ్యులర్ నెం 25

వాది:- త్యాగల వీరన్న

1. పెదిరెడ్ల సన్యాసమ్మ, కీ॥ శేషులైన పెదిరెడ్ల సన్యాసి పాత్రుడుగారి భార్య, నర్సీపట్నం గ్రామ కాపురస్థులు, యెలమంచిలి తాలూకా, విశాఖపట్నం జిల్లా, మదరాస్ స్టేటు.
2. అదినారాయణ, 1 నెం. ప్రతివాది యొక్క మైనరు కుమారుడు, ప్రస్తుతము ఆమెతో నివసిస్తున్నవాడు, వ్యాజ్యవిషయమై గార్డియనుగా నియమింపబడిన 1 నెం. ప్రతివాది ద్వారా.
3. వెంకటరమణ, 1 నెం. ప్రతివాది యొక్క మైనరు కుమారుడు, ప్రస్తుతము ఆమెతో నివసిస్తున్నవాడు, వ్యాజ్యవిషయమై గార్డియనుగా నియమింపబడిన 1 నెం. ప్రతివాది ద్వారా.
4. కృష్ణ, 1 నెం. ప్రతివాది యొక్క మైనరు కుమారుడు, ప్రస్తుతము ఆమెతో నివసిస్తున్నవాడు, వ్యాజ్యవిషయమై గార్డియనుగా నియమింపబడిన 1 నెం. ప్రతివాది ద్వారా.
5. పెదిరెడ్ల చిన్న సన్యాసి పాత్రుడు, నర్సీపట్నం కాపురస్థుడు, యెలమంచిలి తాలూకా, విశాఖపట్నం జిల్లా, మదరాస్ స్టేటు.
6. అప్పారావు, 7. రాములు వీరిద్దరు, 5 నెం. ప్రతివాది యొక్క మైనరు కుమార్లు, ప్రస్తుతము, ఆయనతో పై నుదహరింపబడిన చిరునామా వద్ద నివసిస్తున్నవారు, వ్యాజ్యవిషయమై గార్డియనుగా నియమింపబడిన 5 నెం. ప్రతివాది ద్వారా - ప్రతివాదులు.

ప్రతివాదులకు:- ప్రోనోటు తాలూకు రావలసిన రు. 5950/- వాటను రాబట్టుకొనుటకు వాది మీ పైన దావా దాఖలు చేసి ఉన్నందున 1954 సం. ఫిబ్రవరి నెల 10-వ తేదీ బుధవారము ఉదయం 11 గంటలకు మీరు స్వయముగా గాని, లేక క్రమముగా అధికారము ఇవ్వబడిన ప్లీడరు ద్వారా గాని, లేక వ్యాజ్యమునకు సంబంధించిన సర్వవిషయములు సవిస్తరముగా తెలియచేయబడి, వ్యాజ్యమునకు సంబంధించిన అన్ని ప్రశ్నలకు ప్రత్యుత్తరము చెప్పగల ఈ కోర్టు అడ్వకేటు లేక ప్లీడరు ద్వారా గాని, లేక వ్యాజ్యమునకు సంబంధించిన సర్వ ప్రశ్నలకు ప్రత్యుత్తరము చెప్పగల వారొక వ్యక్తితో పాటు సదరు అడ్వకేటు లేక ప్లీడరు, వాది యొక్క దావాకు సమాధానము చెప్పుటకై ఈ కోర్టులో హాజరు కావలెననియు, అట్లు పై నుదహరింపబడిన తేదీని హాజరగుటకు తప్పిన యెడల సదరు వ్యాజ్యములో నిర్ణయింపబడవలసిన విషయములు మీ పరోక్షమున తీర్మానింపబడునని తెలియచేయబడుచున్నది.

మీ ప్రతివాదమునకు ఆధారములను దస్తావేజులు మీరు స్వయముగా తీసుకురావలెను. లేక మీ అడ్వకేటు ద్వారా పంపవలెను. మీరు రిటన్ స్టేటుమెంటు దాఖలు చేయ దలంచిన యెడల, విచారణకై నిర్ణయింపబడిన తేదీకి నాలుగుదినములు ముందుగా దాఖలు చేయవలెను.

1953 సం. డిసెంబరు నెల 3 తేదీని నా సంతకముతోను ఈ కోర్టు ముద్రతోను ఇవ్వబడినది.

ఉత్తరవు ప్రకారము
బాన్యన్,
చీఫ్ క్లార్కు.

## ఏజన్సీలో సహకారోద్యమము

### కొండజాతుల అభివృద్ధికి కృషి

రాజమండ్రి, డిసెంబరు 26: స్థానిక డిప్యూటీ రిజిస్ట్రారు శ్రీ కె. సూర్యనారాయణగారు 'సూరవరం' (భద్రాచలం ఏజన్సీ) వ్యవసాయ సహకారసంఘమును పరిశీలించి భద్రాచలం, నూగూరు తాలూకాల కొండజాతుల ఆర్థికపరిస్థితిని విచారించి అభివృద్ధికార్యక్రమముల సహకార పద్ధతులమీద ఎట్లు ఆచరణలో పెట్టగలమా అనే విషయమును విచారిస్తున్నారు. గృహపరిశ్రమల సహకార సంఘములూ, అమ్మకం సొసైటీలు యేర్పాటుచేసి కొండజాతుల ఆర్థిక వ్యవస్థను అభివృద్ధిచేయాలని ఆలోచిస్తున్నట్లు తెలుస్తున్నది. అడవులలోని వెదురు నరికేందుకుకూడ పనివారల సహకార సంఘముల యేర్పాటు చేయుటకుగాను సూచించినట్లు తెలిసినది. కొండజాతుల అభివృద్ధికొరకు ప్రభుత్వము వారి సూచనల త్వరలో ఆచరణలో పెట్టగలరని ఆ ప్రాంతాలవారు ఆశిస్తున్నారు.

### కొమరగిరిపట్నం సహకార సంఘము

అమలాపురం తాలూకా కొమరగిరిపట్నములో వ్యవసాయ వలస సహకార సంఘమొకటి డిప్యూటీ రిజిస్ట్రారు శ్రీ కె. సూర్యనారాయణగారిచే మాజీ సైనికుల క్షేమంకొరకు ప్రారంభించబడినది. యిందులో 111 మంది సభ్యులున్నారు. 480 ఎకరముల బంజరుభూమి యిందుకొరకు కేటాయించబడినది. యిందులో 280 ఎకరములు వ్యవసాయమునకనువుగా చేయబడినది. యీ భూములు ప్రస్తుతమున్న పంటకాల్వ చివరికొనలో వున్నవి మొదటిపంటకు భూములు మునిగిపోయి వుంటాయి. రెండవపంటకు నీరు అందే సదుపాయములేదు. (ప్రస్తుత కాల్వల వల్ల). అందుచేత యీ భూములకు ప్రత్యేక పంటకాల్వ చాలఅవసరము. పంచవర్షప్రణాళికలో యిట్టి కాలువ త్రవ్వ యేర్పాటుకు సూచనలు వెళ్ళినట్లు తెలియుచున్నది. యీ సహకార వ్యవసాయ క్షేత్రము అభివృద్ధిచేయుటవల్ల మాజీసైనికుల ఆర్థికవ్యవస్థ బాగుపడుటకు చాల అవకాశమున్నది.

### కడియం ఆవలో లిఫ్టు యిరిగేషన్ స్కీము

రాజమండ్రి తాలూకా కడియం ఆవలో నీటినితోడి వ్యవసాయమునకుపయోగించు పథకము పంచవర్ష ప్రణాళికకు సూచించబడినది. పి. డబ్ల్యు. డి. వారీ స్కీమును యిదివరలోనే విచారించి రు. 65000/- ఖర్చు అవుతుందని అంచనా వేశారు. యీ స్కీమును అమలుజరిపితే 1260 ఎకరములు మాగాణి పైరుకు వచ్చి సం॥ 1 కి 6800 బస్తాధాన్యము అదనంగా పండుతుంది. యీ స్కీము ఆచరించడంవల్ల ఆర్థికంగాకూడ ఆదాయము పెట్టుబడిమీద 1½ రెట్లుగా వచ్చే అవకాశమున్నది. యీ స్కీము అమలుకుగానొక సహకార సంస్థ యేర్పాటు చెయించాలని స్థానిక సహకారశాఖ డిప్యూటీ రిజిస్ట్రారు శ్రీ కె. సూర్యనారాయణగారు ప్రయత్నిస్తున్నారు. (స్వ. వి.)

### ఆంధ్రకేసరి శిలావిగ్రహ ప్రతిష్ఠ

రాజమహేంద్రవరం ప్రభుత్వ ఆర్ట్సు కాలేజీ నూతన భవనముల ఎదురుగా గోదావరి వరద బాధిత నిర్వాహకులకొరకు ప్రభుత్వము వారిచే నిర్మించబడిన, శ్రీ ప్రకాశ నగర్ కుటీరవాసముల ముఖద్వారమున ఆంధ్ర ప్రభుత్వ ముఖ్యమంత్రి శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులుగారి శిలా విగ్రహము పురపాలక సంఘాధ్యక్షులు డాక్టర్ ఎ. బి. నాగేశ్వరరావుగారిచే యీరోజు ఉదయము 9 గంటలకు ప్రతిష్ఠించబడెను.

### కాలినడక ప్రపంచయాత్రికులు

కాలినడకను ప్రపంచయాత్ర చేస్తూవున్న - ఫ్రెంచి దంపతులు శ్రీ జె. డెలొక్, వారి సతీమణి నిన్న సాయంత్రమునకు రాజమహేంద్రవరము వచ్చారు. శ్రీరామకృష్ణ మఠముయొక్క స్థానికాధ్యక్షులు శ్రీ స్వామి నిత్యబోధానందుల అతిథులుగా యీ ఉదయమువరకూ వుండి, యీ ఉదయము కొవ్వూరుకు రైలుమీద వెళ్ళారు. (స్వ. వి.)

## ఆంధ్ర బడ్జెట్

### కేటాయించిన మరికొన్ని మొత్తాలు

కర్నూలు, డిసెంబరు 29: ఆంధ్ర ప్రభుత్వ బడ్జెట్‌లో, యీ దిగువ కార్యక్రమాలకు కేటాయింపబడిన మొత్తముల వివరాలు.

వరదలవల్ల కర్నూలు కడప కాల్వకు కల్గిన గండ్లు వగైరాల మరమ్మతులకు 105000 రూ. మామూలు మరమ్మతులకు రూ. 5900.

పెన్నానది కాలువలకు వరదలవల కలిగిన గండ్లు వగైరాలను మరమ్మతు చేసేందుకు రూ. 6100 మామూలు మరమ్మతులు 160000

శ్రీకాకుళంలో చిన్న ఎదుల జలవినియోగానికి రూ. 88800 బకింగ్ హాం కాలువ సాధారణ మరమ్మతులకు 116800 నాగావళినదీ జల వినియోగానికి 44500.

లాభసాటిగావట్టివిగా వర్గింపబడిన యిలాంటి 24 స్కీములకు మొత్తం 473700—బకింగ్ హాం కాలువ మీద హా రూ. లు కేటాయింపబడినవి.

తీగలేరు ప్రాజెక్టుకు 75000 దొండపాడు చెరువుకు 2 వేలు కొల్లిమాగులవాగు ప్రాజెక్టుకు 58100 పెన్నా-యిద్దలి ప్రాజెక్టుకు 150100 మునియేరు ప్రాజెక్టుకు 900.

హాజీపురం చెరువుకు 50000.

స్వర్ణముఖి ప్రాజెక్టు 35000.

రాళ్ళపాడు ప్రాజెక్టు మొదటి ఘట్టానికి 48500.

వానసిస్టం పనులకు 496100.

చెరువుల అభివృద్ధికి 644000.

ఎగువ పెన్నారు ప్రాజెక్టు 875000

భైరవానితిప్ప ప్రాజెక్టు 516800

గాజులపాడు ప్రాజెక్టు రెండవ ఘట్టానికి 588200.

తుంగభద్ర ప్రాజెక్టు 5700000.

ఆంధ్ర విశ్వవిద్యాలయానికి గ్రాంటు క్రింద 1,95,200.

నేషనల్ కేడెట్ దళాలను సీనియర్ డివిజన్‌కు 92500.

జూనియర్ డివిజన్‌కు 102500.

హరిజన విద్యార్థులకు జీతపు సదుపాయాలు వగైరా కల్పించిన విద్యా సంస్థలకు నష్టపరిహారం క్రింద 307500

పంచాయితీల గ్రంథాలయాలకు గ్రామ సంఘాలకు గ్రాంట్లు క్రింద 250500.

### రోడ్లకు

రాష్ట్ర హైవేస్ శాఖ అధీనంలోని రోడ్లకు 14:400.

జిల్లాలలోని పెద్దరోడ్లకు 839400.

యీ రోడ్లన్నీ పంచవర్ష ప్రణాళికలో చేర్చబడినవి. ఈ డబ్బులో నుంచి 65 వేల రూ.లు పెట్టి నెల్లూరు బొంబై రోడ్డుపై నెల్లూరు దొర్నాల సెక్షన్‌లో వంతెన కడతారు. జిల్లాలోని పెద్ద యెత్తున ప్రత్యేకించిన మొత్తంలో 374500 పి. డబ్ల్యు. డి. ప్రాంతాలలో యిండ్లకు కేటాయింపబడినవి. అనకాపల్లినుంచి మిరపమాకులూరు ఘాట్ రోడ్డుకూడా యిందులో చేర్చబడింది. చోడవరంనుంచి దంపవరకు రోడ్డు వేయడానికి 74 వేల రూ.లు బడ్జెట్‌లో ప్రత్యేకింపబడినవి.

### ప్రభుత్వ అతిథిభవనాలు

విజయవాడలోనూ, విశాఖపట్నంలోనూ, ప్రభుత్వ అతిథి భవనాల నిర్మాణానికి చెరి 75 వేల రూ.లు బడ్జెట్‌లో ప్రత్యేకింపబడినవి. భవనాల నిర్మాణ కార్యక్రమం క్రింద కర్నూలులో ప్రభుత్వ అతిథి భవనానికి 1½ లక్షల రూ.లు కేటాయించబడినవి.

### జాతీయ రహదారులకు 35 లక్షల రూ.లు

పంచవర్ష ప్రణాళికలో చేర్చబడిన జాతీయ రహదారుల అభివృద్ధి కార్యక్రమానికి బడ్జెటులో 3549900 రూ.లు కేటాయింపబడినవి.

ఈ మొత్తం ముఖ్యంగా, ఆంధ్ర రాష్ట్రంలోగుండా పోయే కలకత్తా మద్రాసు ట్రంకు రోడ్డును, కొ॥ కన్యాకుమారి రోడ్డును అభివృద్ధి చేయడానికి వినియోగింపబడునట్లు సూచించబడింది. ఈ మొత్తంలో సిమెంట్ కాంక్రీటుకు 180000 తారు వేయుటకు 174000 విశాఖపట్నం దక్షిణభాగంలో రోడ్డునుమలపడానికి 250000, కృష్ణా సెక్షన్‌లో రోడ్డుకు సిమెంటు కాంక్రీటు వేయడానికి 87500. నెల్లూరు సెక్షన్‌లో రోడ్డుకు తారు వేయడానికి 50000. వినియోగింపబడుతుంది.

శ్రీబోలు నుంచి బుడంపాడుకు కంకరరోడ్డు వేయడానికి 128500 బుడంపాడు నుండి తాడేపల్లిగూడెం వరకు రోడ్డు వేయడానికి 71500 ఉండికాలవ మంచి కరిలగూడెంకు రోడ్డు వేయడానికి 167500 మద్రాసు కలకత్తా ట్రంకురోడ్డుపై, నాగుల వలసవద్ద చంపావతిపై వంతెనకు 128000 విశాఖపట్నం దక్షిణభాగాన, మహేంద్ర గెడ్డపై వంతెనకు 23 వేలు. గోదావరి నది పాయయైన గౌతమిపై వంతెన నిర్మాణానికి 12,50,000 (ఈ వంతెన నిర్మాణానికి 1 కోటి 20 లక్షల రూ.లు ఖర్చవుతుందని అంచనా. ఈ వంతెన నిర్మాణం గురించి దర్యాప్తుచేసి అంచనాలు తయారు చేయడానికి 2500/- రూ.లు ప్రత్యేకించబడినవి.)

ఈ వంతెన నిర్మాణసందర్భంలో తూర్పుగోదావరి సెక్షన్‌లో రోడ్డును మలుపు త్రిప్పడానికి లక్ష రూ. లు.

గోదావరి వంతెన పనుల అజ్మాయిషీకి మరొక లక్ష రూ. లు.

పంపానదిపై, పడిపోయిన వంతెన కట్టడానికి 19700.

నెల్లూరువద్ద పెన్నానదిపై వంతెన కట్టడానికి 4 లక్షలు రూ. లు నెల్లూరు వద్ద పెన్నానదిపై వంతెనకట్టే సందర్భంలో కోవూరువద్ద రోడ్డు మలుపు బ్రిడ్జి కట్టడానికి 140500 రూ. లు.

విజయవాడవద్ద కృష్ణానదిపై వంతెనకట్టడానికి 1 లక్ష రు. లు

నెల్లూరు సెక్షన్‌లో మరో బ్రిడ్జి కట్టడానికి 3500, భీమడోలు చేబ్రోలు సెక్షన్‌లో జాతీయ రహదారిపై వంతెన నిర్మాణానికి 10600 బుడంపాడువద్ద ఏలూరు కాలవపై వంతెన నిర్మాణానికి 65000 బడ్జెట్‌లో ప్రత్యేకింపబడినవి.

గోదావరి పాయయైన వశిష్ఠపై వంతెన కట్టడానికి 50 వేల రూ. లు బడ్జెట్‌లో ప్రత్యేకింపబడినవి. ఈ వంతెనకు 65 లక్షల రూ. లు ఖర్చవుతుందని అంచనా. గౌతమిపై వంతెనతోపాటు, వశిష్ఠపైకూడా వంతెన కట్టకపోతే, గోదావరి రోడ్డు వంతెన పూర్తి అయినట్లు కాదు.

కర్నూలు బెంగుళూరు సెక్షన్‌లో కొత్త కన్యాకుమారి రోడ్డును 51½ మైళ్ళ నిడివిని వెడల్పు చేయడానికి లాంఛనంగా 3700 రూ.లు బడ్జెటులో ప్రత్యేకించారు.

అనంతపురం జిల్లాలో పెన్నానదిపై వంతెనకు లాంఛనంగా 100 రూ. లు ప్రత్యేకించారు.

కోడూరు వంకపై చప్టారోడ్డు మరమ్మతుకు 29600/- శ్రీకాకుళం సెక్షనులో రాయఘడ విజయనగరం రోడ్డుపై వంతెనల మరమ్మతులకు 25 వేల రూ.లు బడ్జెట్‌లో ప్రత్యేకించారు.

## "సోమశిల ఆనకట్ట వెంటనే నిర్మించాలి"

### నెల్లూరులో ముఖ్యమంత్రికి విజ్ఞప్తులు

నెల్లూరు, డిసెంబరు 26: నెల్లూరు జిల్లా ప్రజల దారిద్ర్యబాధ తొలగించుటకుగాను సోమశిలవద్ద వెంటనే ఆనకట్ట నిర్మాణం ప్రారంభించాలని కోరుతూ ముఖ్యమంత్రి శ్రీ ప్రకాశంగారికి నెల్లూరు పౌరులతరఫున ఒక విజ్ఞప్తిపత్రం సమర్పింపబడినది. జిల్లాలో రేవుపట్నములైన రామాయపట్నం, కృష్ణపట్నం, దుగరాజపట్నం, మున్నగు రేవుల పునరుద్ధరించాలనీ, కేంద్రప్రభుత్వమిచ్చిన 5 కోట్ల రూ. ల గ్రాంటునుంచి మైనరు యిరిగేషను ప్రాజెక్టుల నిర్మాణానికి కొంత వినియోగించాలనికూడ కోరారు.

### జాతీయవికాస కార్యక్రమం జమీన్ ప్రాంతానికి విస్తరణ

వెంకటగిరి శాసనసభ్యుడు శ్రీ పి. వెంకటస్వామిరెడ్డి ఒక విజ్ఞప్తిపత్రం సమర్పిస్తూ వెంకటగిరి తాలూకాలోని జమీందారీ గ్రామాలు కేవలం వర్షాధారంపై ఆధారపడినవనీ, యీ ప్రాంతంలో యిరిగేషన్ సౌకర్యాలు కలిగించుటకుగాను సెలయేరులకు కట్టలు కట్టడం, చెరువులు మరమ్మతుచేయించడం జరగాలనీ, జాతీయ వికాస కార్యక్రమం యీ ప్రాంతానికి విస్తరింపజేయాలనీ కోరారు. జమిందారీ అడవులలో కట్టెలుకొట్టుకునే హక్కు తిరిగి వెంకటగిరిలో 500 మంది మహమ్మదీయ, అరవమాల కుటుంబాలకు యిప్పించాలనికూడా అభ్యర్థించారు.

### జిల్లారైతుసంఘం విజ్ఞప్తి

జిల్లా రైతుసంఘం ఒక విజ్ఞప్తిచేస్తూ రైతులవద్దవున్న వాతిధాన్యం మద్రాసుకు ఎగుమతి చేయుటకు జనవరి ఆఖరు వరకు అనుమతించాలని కోరారు. సోమశిల ప్రాజెక్టు వెంటనే నిర్మించాలని, యీ జిల్లా పరిస్థితులనుబట్టి ధాన్యంధర పెంచాలనీకూడ కోరారు

### విద్యార్థుల వినతి

జిల్లా డెమొక్రటిక్ విద్యార్థి యూనియన్‌వారొక వినతిపత్రం సమర్పిస్తూ దేవస్థానం ధనంతో తిరుపతిలో ఒక ప్రత్యేక కళాశాల నెలకొల్పాలనీ, రాయలసీమ కళాశాలలను వెంటనే ఆంధ్ర విశ్వవిద్యాలయానికి అనుబంధించాలనీ, డిటెన్షన్ విధానం, నూతన ప్రాథమిక విద్యావిధానం రద్దుచేయాలనీ, నెల్లూరులో ఉపాధ్యాయుల శిక్షణ కళాశాల, 'లా' కళాశాల స్థాపించాలనీ కోరారు.

### యన్. జి. వో. ల విజ్ఞప్తి

జిల్లా యన్. జి. వో. ల సంఘంవారొక వినతిపత్రం సమర్పిస్తూ ప్రస్తుత పరిస్థితులలో కేంద్రప్రభుత్వం అలవెన్సులవలె అధిక ధరల బత్తెమును మంజూరు చేయాలనీ మద్రాసు సెలవు నిబంధనల రద్దుపరచి ప్రాథమిక నిబంధనల ప్రకారం సెలవు మంజూరు చేయాలనీ, రిటైరయిన వుద్యోగులకు అలవెన్సులుకూడ కలపాలనీ కోరారు. ఆంధ్ర యన్. జి. వో. ల సంఘంను గుర్తించి తమకోరికల తీర్చాలని అభ్యర్థించారు.

## గీతోపన్యాసములు

నరసాపురం, డిశెంబరు 26: శ్రీ నిత్యానందేంద్ర సరస్వతీస్వామివారు సుమారు నెలరోజులనుండి యిచ్చట శ్రీ ఆదికేశవయంబరుమన్నారు ఆలయమందు ఉపనిషత్ గీతోపన్యాసములు యిస్తున్నారు. వారి ఉపన్యాసములు సులభశైలినియిచ్చుచుండుటచే ప్రజలు విని ఆనందిస్తున్నారు.

## రొంపేరు రైతులపై దౌర్జన్యం

### అసెంబ్లీలో విరామతీర్మానం త్రోసివేత

కర్నూలు, డిసెంబరు 29: రొంపేరు బంజరు భూములను సాగుచేసుకొంటున్న రైతులపై దౌర్జన్యం, హింస జరుగుతున్నదని, మిగతా కార్యక్రమాన్ని నిలిపి, ముందుగా యీవిషయాన్ని సభవారు చర్చించాలని కోరుతూ శ్రీ ప్రగడ కోటయ్య ఎం. ఎల్. ఎ. గారు ప్రతిపాదించిన విరామ తీర్మానాన్ని యివాళ స్పీకరు వెంకట్రామయ్యగారు త్రోసివేశారు.

రొంపేరు భూములను సుమారు 10 వేల మంది రైతులు సాగుచేసుకొంటున్నారని, యిటీవల కొందరు, పంట పొలాలపై దాడిచేసి పంటలు ధ్వంసం చేస్తున్నారని, అంటూ ఉదాహరణకు ఒక్క రజక కుటుంబాలు సాగుచేసుకొన్న 98 ఎకరాల పొలంలో పంట నాశనం చేశారని కోటయ్యగారు తీర్మానం తెలియజేశారు.

డిప్యూటీ ముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డిగారు సమాధానమిస్తూ, గౌరవ సభ్యుడు తెలిపిన విషయాలను సంబంధించి సమాచారం పంపవలసిందిగా ప్రభుత్వం తమ ఉద్యోగులకు వర్తమానం పంపిందనీ, ఆసమాచారం అందగానే గౌరవ సభ్యునికి తెలియపర్చడమవుతుందని చెప్పారు.

తీర్మానాన్ని నిరాకరిస్తూ విరామ తీర్మానాల ప్రతిపాదనల విషయంలో నిర్దిష్టమైన నిబంధనలు ఉన్నవని ముఖ్య విషయాలపైతప్ప ప్రతి విషయంపైనా విరామ తీర్మానాలు ప్రతిపాదించ వీలులేదని స్పీకరు చెప్పారు.

### హక్కుల తీర్మానం

కిందటి నెలలో ఆంధ్రరాష్ట్రశాసనసభ రాజధాని సమస్యగురించి చేసిన నిర్ణయానికి ఉపముఖ్యమంత్రి నీలం సంజీవరెడ్డిగారు చేసిన వ్యాఖ్యానాన్ని చర్చించాలంటూ ఎల్లమందారెడ్డిగారు నేడు అసెంబ్లీసమావేశంలో హక్కుల తీర్మానం ప్రతిపాదించబోయారు.

ఈ తీర్మానాన్ని స్పీకరు వెంకట్రామయ్యగారు త్రోసివేశారు. సంజీవరెడ్డిగారు చేసిన వ్యాఖ్య తప్పు కావచ్చు. లేదా ఒప్పుకావచ్చు. ఏమైనా దానిలో సభ హక్కులనుగాని, సభ్యులలో ఏ ఒక్కరి హక్కులనుగాని ప్రమాదమేమీ లేదని స్పీకరు రూలింగ్ ఇచ్చారు.

రాజధానిని విశాఖపట్టణానికి మార్చాలన్న ప్రధాన తీర్మానం ఓడిపోయినందున ఆ సందర్భంలో ప్రభుత్వం తరఫున చేయబడిన ప్రకటన ఇప్పుడు రద్దయినట్లేనని సంజీవరెడ్డిగారు అన్నట్టు పత్రికలలో వెలువడిన వార్తలను ఎల్లమందారెడ్డిగారు తమ తీర్మానంలో ప్రస్తావించారు.

### బడ్జెట్ చర్చ తేదీలమార్పుకు ఆక్షేపణ

కర్నూలు, డిసెంబరు 28: అసెంబ్లీలో నేడు ప్రశ్నోత్తరాలు పూర్తికాగానే కమ్యూనిస్టు శాసనసభ్యుల నాయకుడుగా ప్రస్తుతం వ్యవహరిస్తున్న పి. వెంకటేశ్వర్లుగారు మాటలాడుతూ ప్రతిపక్షంతో సంప్రదించకుండా ప్రభుత్వం బడ్జెట్ సమావేశం ఏర్పాటుచేసిన విషయం గురించి పాయింటాఫ్ ఆర్డర్ సూచించారు. ప్రభుత్వం ఇలా చేసినందున బడ్జెట్ మీద చర్చలో పాల్గొనడానికి ప్రతిపక్షానికి అసౌకర్యంగా ఉన్నదనీ, అసలు ప్రతిపక్షం అనేదే లేనట్లు ప్రభుత్వం వ్యవహరించిందనీ వెంకటేశ్వర్లుగారు అసందర్భంలో అన్నారు. తమ హక్కులను కాపాడి మదరాసు శాసనసభలో లాగానే తమకు సౌకర్యాలు కలిగించవలసిందిగా వెంకటేశ్వర్లుగారు స్పీకరును అభ్యర్థించారు.

ఈ సమస్యపట్ల ప్రభుత్వ వైఖరి వివరించవలసిందిగా ఆర్థిక మంత్రి విశ్వనాథంగారిని స్పీకరు కోరారు.

అంతట విశ్వనాథంగారు మాటలాడుతూ బడ్జెట్ సమావేశం ఏర్పాటు చేసే విషయం ప్రభుత్వానికి సంబంధించిన విషయమనీ ఆవిషయంగురించి ప్రతిపక్షంవారిని సంప్రదించవలసిన అవసరం లేదనీ అన్నారు. అంతలో ఉప ముఖ్యమంత్రి నీలం సంజీవరెడ్డిగారి కలిపించుకుని అసెంబ్లీ సమావేశ కార్యక్రమం ఏర్పాటు చేసే సందర్భములో ప్రతిపక్షంవారికి అసౌకర్యం కలిగించాలనే ఉద్దేశం ప్రభుత్వానికి లేదన్నారు.

అంతట స్పీకరు ప్రభుత్వ వాదన సంగీకరించాలి ఇకముందు అసెంబ్లీ కార్యక్రమం నిర్ణయించేటప్పుడు ప్రతిపక్షంవారిని సంప్రదిస్తూ ఉన్నారు.

(యు. పి. ఐ)

### మొదటిరోజు ప్రశ్నోత్తరాలు

కర్నూలు, డిసెంబరు 28: రాయలసీమలో అడవి కళాశాలను నెలకొల్పే ఉద్దేశం ప్రభుత్వానికి లేదని టి. లక్ష్మీనారాయణరెడ్డిగారి ప్రశ్నకు సమాధానంగా వ్యవసాయశాఖమంత్రి జి. లచ్చన్నగారు నేడు ఆంధ్ర శాసనసభ సమావేశంలో అన్నారు.

ప్రాథమిక జాలరుల సహకార సంఘాల కార్యకలాపాలన్నింటినీ సమన్వయం చెయ్యడానికి వీలుగా ఆంధ్రరాష్ట్ర జాలరి సహకార సంఘం నెలకొల్పడంలో గల సాధకబాధకాలను పరిశీలించవలసిందిగా సహకార సంఘాల రిజిస్ట్రారు, మత్స్యశాఖ డైరెక్టర్లను కోరామని ప్రగడ కోటయ్యగారి ప్రశ్నకు సమాధానంగా స్థానిక మంత్రి శ్రీ డి. సంజీవయ్యగారు అన్నారు.

తక్కువ జీతాలు సంపాదించే ప్రభుత్వోద్యోగుల పిల్లలకు విద్యా సౌకర్యాలు ఏర్పాటుచేసే విషయం ప్రభుత్వం పరిశీలిస్తుందని లక్ష్మీనారాయణరెడ్డిగారి ప్రశ్నకు సమాధానంగా రెవిన్యూమంత్రి కె. కోటిరెడ్డిగారు చెప్పారు.

ఒంగోలు పోలీసువారి అధీనంలో ఉన్న హైదరాబాదు నివాసి జి. పడిగల్ రెడ్డి అనే ఆయన ఉరిపోసుకుని ఆత్మహత్య చేసుకున్నాడని మరొక ప్రశ్నకు సమాధానంగా ఉపముఖ్యమంత్రి సంజీవరెడ్డిగారు చెప్పారు. దొంగతనం చేసిన నేరానికి పడిగల్ రెడ్డి అరెస్టు చేయబడ్డాడనీ, ఆయన శవాన్ని పరీక్ష చేయగా ఆయనకు అనేక దీర్ఘ వ్యాధులున్నట్లు తెలిసిందనీ కూడా ఉపముఖ్యమంత్రి చెప్పారు.

చేనేతవస్త్రాలమీద అమ్మకంపన్ను తొలగించే విషయం ప్రభుత్వ పరిశీలనలో ఉన్నదని అసెంబ్లీలో ప్రశ్నోత్తరాల సమయంలో వాణిజ్యసంకాల శాఖ మంత్రి ఎస్. బి. పి. పట్టాభిరామారావుగారు నేడు అన్నారు.

చేనేత పారిశ్రామికులకు తక్షణం చేయవలసిన అవసరం గురించి రాష్ట్రప్రభుత్వం భారతప్రభుత్వానికి తెలియచేసింది. ప్రస్తుతం ఏటేటా పదివేల రూపాయల చేనేతవస్త్రాల వ్యాపారం మీద మాత్రమే అమ్మకం పన్ను విధించబడుతున్నది. కనుక అమ్మకం పన్ను మినహాయించినంత మాత్రాన చేనేత పరిశ్రమకు తగినంత సహాయం జరగదని మంత్రి పట్టాభి రామారావు గారు వివరించారు.

ఒక అనుబంధప్రశ్నకు సమాధానం చెబుతూ చేనేతవస్త్రాలను అమ్మకం పన్నునుంచి మినహాయిస్తే ప్రభుత్వ ఆదాయం సంవత్సరానికి సుమారు ఆరు లక్షలరూపాయలు తగ్గుతుందని మంత్రి పట్టాభి రామారావుగారు చెప్పారు. చేనేత పారిశ్రామికుల కష్టాలు ప్రభుత్వానికి తెలుసు. చేనేత పరిశ్రమకు సహాయపడే అనేక సూచనలను ప్రభుత్వం పరిశీలిస్తున్నది అనికూడా ఆయన చెప్పారు.

చేనేతపారిశ్రామికులు ఎక్కువమందున్న ప్రాంతాలలో వారికి సహాయపడడానికిగాను గంజికేంద్రాలు నెలకొల్పవలసిందిగా జిల్లాకలెక్టరులను ఆదేశించామని ఎన్. నారాయణప్పగారి ప్రశ్నకు సమాధానంగా రెవిన్యూ మంత్రి కె. కోటరెడ్డిగారన్నారు. ఈ గంజి కేంద్రాలు ఒక్క పంచాయతీ ప్రాంతాలకు మాత్రమే సంబంధించినవి కావని కూడా రెవిన్యూ మంత్రి అన్నారు.

